# సృజన

96

అక్టోబర్ 1979

ఆధునిక సాహిత్య వేదిక
మా స ప త్రి క

సెప్టెంబర్ 29, 30, అక్టోబర్ 1న తిరుపతిలో
ఏడవ మహాసభలు జరుపుకుంటున్న
విప్లవ రచయితల సంఘం
సాహిత్య సాంస్కృతిక పోరాట దీక్షకు
విప్లవాభినందనలు

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు

ఈ సంచిక రు. 1-50 పైసలు

# భారతదేశంలో స్త్రీలసమస్యలు

# స్త్రీ విమోచనోద్యమం - దృక్పథాలు

తెలుగు పత్రికారంగంలో కొత్తప్రయోగం

## నవంబర్ 1979 సృజన

## స్త్రీ సమస్యల, పోరాటాల

## ప్రత్యేక సంచికగా వెలువడుతుంది

1. మహానగరంలో స్త్రీల ఉద్యమం- ఢిల్లీ: ఒకఆశ, ఒకసమస్య
2. గిరిజన స్త్రీపోరాటం- ధులియా: మహిళాగళాలు
3. హిందూమతం- స్త్రీ
4. వరకట్నం మంటల్లో...
5. స్త్రీ సమస్యలు- కొన్ని మౌలికప్రశ్నలు

ఇంకా, ఇంకా.... స్త్రీలసమస్యలను, పోరాటాలను ప్రజాసమస్యల్లో పోరాటాల్లో భాగంగా ప్రతిబింబించే రచనలతో వెలువడుతుంది.

స్త్రీవిమోచనోద్యమాల్లో పాల్గొంటున్న ఆయా ప్రాంతాల్లో, ఆయారంగాల్లో పనిచేస్తున్న 'సృజనమిత్రులు' సృజనకోసం ప్రత్యేక ఆసక్తితో, శ్రద్ధతో చేసిన రూపకల్పన-

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

అక్టోబర్ 1979 మాసపత్రిక 96

ఈ సంచికలో....

సంపాదకీయం 2

కవితలు : ఎవరు ఖైదీ - శంకర్ 54

చరమాంకం - పెద్దారెడ్డి 56

రెడ్ శాల్యూట్స్ డియర్ చైర్మన్ - అజ్ఞాత సూరీడు 57

పాటలు : ఎరుపురేక - కె.వి. రమణారెడ్డి 4

విర్రవీగే వియత్నమోడా - శివసాగర్ 55

నవల - సీరియల్ : ఉప్పెన - చాలిపో 26

కథ : సృష్టికర్తలు - అల్లం రాజయ్య 43

దూరానికి దగ్గరగా - పి. సి. నరసింహారెడ్డి 38

మార్క్సిజం - సాహిత్యం : ఆరెస్ సుదర్శనానికి సమాధానం
త్రిపురనేని మధుసూదనరావు 5

సమీక్ష : వేలాడిన వాస్తవం - 'వేలాడిన మందారం' నవల
ఫణిభూషణ్ 58

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు    ఈ సంచిక రు. 1-50 పైసలు

# సంస్మరణ

విప్లవ రచయితలసంఘం ఏడవ మహాసభలు తిరుపతిలో జరుగుతున్నాయి. ఫ్యాషనబుల్ అల్ట్రా మాడరన్ దైవభక్తికి చిహ్నంగా తలనీలాలను, నల్లధనాన్ని కొల్లగొంటున్న వడ్డికాసులవాని బ్రహ్మోత్సవాలు కొండమీద- దోపిడీసంస్కృతికి, మూఢవిశ్వాసాలకు వ్యతిరేకంగా నూతన ప్రజాస్వామిక విప్లవంలో సాహిత్య కళా సైన్యంగా పోరాటం కొనసాగిస్తున్న విరసం సభలు కొండకిందా జరుగుతున్నాయి.

అయితే తిరుపతిలో ఏడుకొండలు, పంగనామాలేకాదు దోపిడీ కొండలను తవ్వడానికి పలుగూపారా చేపట్టి ప్రజల్లో నీటిలోచేపల్లా మసలుకుని ప్రజలకోసం ప్రాణాలర్పించిన మహదేవన్‌లున్నారు. డాక్టర్ గరికపాటి రాజారావు ప్రజానాట్య మండలి కళాసంప్రదాయాలను మద్రాసు సినిమా రంగంలో ప్రయోగించడానికి కృషి చేసిన కళాకారుడు మహదేవన్.

చిత్తూరుసీమలో ప్రజావిప్లవాల నెత్తుటిచాలుపెట్టి
సినిమారంగాన్ని వదిలి పోరాటాన్నే కళారంగంగా చేపట్టి
ఊపిర్లుపోసి ఎర్రపూలు పూయించిన మహనీయుడు.

అజ్ఞాతజీవితం- జెయిలు- అల్సర్ఆపరేషన్ అనారోగ్యం- అయినా మళ్ళీ జెయిల్‌దూకి అజ్ఞాతవాసం- ఎమర్జెన్సీ చీకటిరోజుల్లో ఎక్కడోపట్టుబడి ఎక్కడో శత్రువుచేతుల్లోబలి. ఆయనతోపాటు పోలీసులకు పట్టుబడి కాల్చివేయబడిన యువ న్యాయవాది నరసింహారెడ్డికూడ చిత్తూరుసీమ చిత్తడినేలలో చిగురించిన నెత్తుటిమొగ్గ.

తిరుపతిని ఆధ్యాత్మిక భావప్రచారకేంద్రంగా తీర్చిదిద్దడానికి అన్నమయ్య నుంచి అన్నారావుదాకా శ్రీకృష్ణదేవరాయలనుంచి చెన్నారెడ్డిదాకా చాలప్రయాస పడ్డారు. పడుతున్నారు. ఆ కేంద్రాల గర్భాలనుంచే విప్లవయువతరం పుట్టుకొస్తున్నది. కామ్రేడ్ నాగరాజు అటువంటి విప్లవవిద్యార్థి. విద్యాలయాల్లో, పల్లెల్లోసహవిద్యార్థులతో కలిసి పోరాటాన్ని నిర్మించినవాడు. చిత్తూరుజెయిల్లో అమరుడు నారాయణరెడ్డితోపాటు తుపాకితూటాను ఎదురించినవాడు. కామ్రేడ్ నారాయణరెడ్డి జైల్లోనే తుపాకితూటాకు బలియైపోయినాడు. ఎమర్జెన్సీ కాళరాత్రి నాగరాజు వెదురుచెరువు తోటలోన శత్రువు వేసిన బాయ్‌నెట్‌పోటుకు బలియైపోయాడు.

ఒకచేత్తో కన్నీరు తుడుచుకొని
వేరొక చేత్తో ఎర్రజెండ ఎత్తుకొని

రోజురోజు గుండెల రాజుకొని మండుకున్న నాగరాజు అనే నిప్పురవ్వను పల్లె పల్లె పట్టణాలు చుట్టుముట్టే దావానలంగా రగిలిద్దాం. ఒకచేత ధర్మవరంలో రైతుకూలీ సంఘాలు, రైతాంగ పోరాటాలు, మరొకచేత అనంతపురంలో విప్లవ రచయితల సంఘం, సాహిత్య సాంస్కృతిక పోరాటాలు- పాణిగ్రాహి ఒరవడిలో నిర్వహించిన పోరాటాల పరిటాల రాయలసీమ కృషీవలుడు. అనంతపురం నుంచి ఆంధ్రదేశమంతటా, తరిమెల నుంచి భారతదేశమంతటా తెలంగాణ, నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాట పథమం తానడచి జీవితాంతమూ విప్లవ కారుడుగా జీవించి ప్రజలకొరకు మరణించిన నాగిరెడ్డి సాలుబెట్టిన భూమి రాయలసీమ.

తెలంగాణ పోరాటపు తొలిపేకువ తోటిలేచి

రెక్కవిప్పిన రాయలసీమ వెలుగు పులుగు నీలం రామచంద్రియ్య. అధ్యాపక వృత్తి సమాజాన్ని తెలుసుకునే చదువులతో మొదలుపెట్టి గోదావరీ లోయ రైతాంగ పోరాట నిర్మాణంలో ప్రాణాలు అర్పించే దాకా జీవన వ్యావృత్తిగా ప్రవృత్తిగా విస్తరించింది.

తిరుపతిలో 'గోవింద' కొట్టించే దేవుడే లేడు. అరవై ఏళ్ళ వృద్ధుడు 'కమ్యూనిస్టు' గోవిందరెడ్డి వున్నాడు. చిత్తూరు జిల్లాలో పిల్లల్లో పిల్లవాడు యువకుల్లో యువకుడు- అందరికీ కమ్యూనిస్టు గోవిందరెడ్డిగా మాత్రమే తెలిసిన, కమ్యూనిజం ప్రచారానికి కాలికి బలపం కట్టుకొని తిరిగిన ఈ కామ్రేడ్‌ను జూన్ 30న చిత్తూరు జిల్లా ఒక గ్రామంలో భూస్వాములు పట్టుకొని పట్టపగలు కొట్టిచంపి శవం గుర్తు తెలియకుండా ట్రాక్టరు కింద నలగగొట్టారు. మూడు దశాబ్దాలకు పైగా విరామమెరుగకుండా, అలసట లేకుండా కమ్యూనిస్టు ఉద్యమానికి తన మాంసమూ మూల్గులూ కరిగించి కన్నుమూసిన ఆ వీరయోధుని నెత్తుటి తడిలోనే ఈనాడు

ఎత్తినాం విరసం జెండా
అలలలలుగా పరదలొత్తు
పోరుపోరు జెండా........

21-9-79 —సంపాదకుడు

# ఎరుపు రేక

కె. వి. రమణారెడ్డి

చిత్తూరు సీమా పిల్లతెమ్మెరా
తిరుమల తిరుపతి వేడిపయ్యెరా
బెంగళూరు చలిపిడుగు తొందరా
మదరాసున చిచ్చర పిడుగేరా—
తమ్ముడా నర్సింహారెడ్డీ
తెలియ జెప్పాకుండనె బోయావా!

రివట లాంటీ వొంటి సొంపూ
జాటీ లాంటీ కండ పూపూ
గాలివాలూ నీటిజాలూ
నీలో ఎట్టా కలగలిశాయో
తమ్ముడా....

పూతరా పసరు పిందెరా
చిగురురా చిరుత మువ్వరా
మలిసంజ అపరంజి రేఖరా
రేయెండ కిరణాల వాకరా
తమ్ముడా....

బెంగళూరులో మునిగిందెపుడో
మదరాసున నువు తేలిందెపుడో
ఎప్పుడు మరియా నల్లగొండలో
చప్పుడు జెయ్యక పడుకొందెపుడో
తమ్ముడా....

సడిజెయ్యని సుడిగాడ్పు ముట్టడీ
రక్తం మరిగిన రాక్షసికి పట్టుబడి—
అకస్మాత్తు దిగి దూకిన డేగా
గోళ్ల గుచ్చి ఎగరేసుకు పోగా
తమ్ముడా....

నూగే వదలని పెసరకాయలా
పసరానికి చిరుదిండిగ మారీ,
పిల్లతెమ్మెరవు వడగాడ్పులకే
తల్లడిల్లి మరి వడలిపోతివా
తమ్ముడా....

మబ్బులోపలీ మెరుపువి కావా
చిమ్మచీకటికి మంట వెయ్యవా
చలిలోనైనా సెగలు లేపవా
చావునైనా చిరునవ్వ నెదుర్కోవా
తమ్ముడా....

ప్రజలు ప్రవాహం నువొక్క అలవే
ప్రజాఉద్యమంలో గలగలవే
గెలుపు వైపుకే ఎరుపు వైపుకే
నిలుపులేని తొందర కదలికవే
తమ్ముడా నర్సింహారెడ్డీ
విప్లవ లిపిచేవ్రాలు నీవేరా!

(కామ్రేడ్ మహాదేవన్‌తో కలిసి ఎక్కడో మదరాసులో పట్టుబడి నల్గొండలో దేహాన్ని వదిలిన చిత్తూరు యువ కామ్రేడ్ నరసింహారెడ్డి స్మృతిగీతం.)

(గత సంచిక తరువాయి) ఆరెస్ సుదర్శనం వక్రీకరణకు సమాధానం :

# మార్క్సిజం - సాహిత్యం

త్రిపురనేని మధుసూదనరావు

## మానవతా వాదం

ఈ రోజుల్లో మానవతావాది కానివాడు ఎవడు ? సార్వజనీన, సార్వకాలిక విలువలు గల సాహిత్యాన్నీ, సామాజిక స్పృహవున్న సాహిత్యాన్నీ, ప్రచార విలువలు గల సాహిత్యాన్నీ అభినందించాడు కాబట్టి మార్క్సు మానవతావాది అట. రాజకీయాలకి పనికి వస్తుందా రాదా అనే గీటు రాయి మీద సాహిత్యాన్ని కొలుస్తూ మార్క్సు మానవతా వాదానికి మార్క్సిస్టులు అపచారం చేస్తున్నారట. అంటే సుదర్శనం కోసం మార్క్సు చారిత్రిక భౌతిక వాదాన్నీ, వర్గపోరాట సిద్ధాంతాన్నీ వదిలేశాడన్న మాట. సుదర్శనం భావించే మానవతా వాదానికీ మార్క్సు మానవతా వాదానికీ తేడా వుంటుందన్న జ్ఞానం కూడా వుండనవసరం లేదా ?

మార్క్సు మానవతావాదం సామాజిక మానవతావాదం, సామూహిక మానవతా వాదం. గుంపు లేదా మంద నుంచి సమూహం లేదా సమిష్టి మానవతకి పురోగమనాన్ని వాస్తవ చారిత్రిక సూత్రాలనుంచి మార్క్సు విశ్లేషించాడు. మార్క్సుకి విపులమైన సాహిత్య అధ్యయనం వుంది. అనేక గ్రంథాలనుంచి అనేక వాక్యాల్ని తన రచనలో సందర్భాన్ని అనుసరించి ఉల్లేఖించాడు. బూర్జువా వాస్తవికతని చిత్రించిన నవలల్నీ, నాటకాల్నీ మార్క్సు అభినందించాడు. అదనపు విలువని గురించి అప్రయత్నంగా చెప్పినందుకు బాల్జాక్‌ని మెచ్చుకున్న విషయం అందరికీ తెలిసిందే. రచయితల్ని అభిమానించటంలో మార్క్సు ఎక్కడా తన ఆశయాలకి విరుద్ధంగా పోలేదు. చరిత్ర నుంచి సాహిత్య చరిత్రనీ, సాహిత్య చరిత్ర నుంచి సాహిత్యాన్నీ వాటికి స్వతంత్ర ప్రతిపత్తి ఇవ్వటానికి విడదీసి ఎన్నడూ పరిశీలించ లేదు. సుదర్శనం చెప్పే మూడురకాల సాహిత్య విభజన మార్క్సు ఎక్కడా చేయలేదు. సాహిత్యాన్ని కార్మికవర్గపార్టీరాజకీయాల పరంగానే చూశాడు. 1848లో మార్క్సు పార్టీరచయితలకి శిక్షణ ఇవ్వటం కోసం Neue Rheinis the Zeitung అనే పత్రికని నడిపాడు. పార్టీ రాజకీయాలకీ, విప్లవభావప్రచారానికీ మార్క్సు ఎంత విలువ ఇచ్చాడో మార్క్సుకీ ఫ్రెయిలిగ్రాత్ (Freiligrath)కూ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల్ని బట్టి తెలుసుకోవచ్చును.9

తాను ముందే నిర్ణయించుకున్న అభిప్రాయాల్ని నిలబెట్టగల కొటేషన్లను పోగు చేసుకోవటమే కానీ మార్క్సిజాన్ని నిజాయితీతో, సృజనాత్మకంగా అధ్యయనం

చెయ్యాల్సిన అవసరాన్ని సుదర్శనం గమనించలేదు. రాజకీయాలకీ, పార్టీలకీ, వర్గాలకీ దూరంగా, అతీతంగా సాహిత్యం వుంటుందని 'శాశ్వత సత్యాల్ని' అన్వేషించే మధ్యతరగతి అహంభావ మేధావులు ఊహించుకోవటం చరిత్రలో వున్న విషయమే. సాహిత్యాన్ని రాజకీయ ప్రమాణాల్తో మార్క్సు చూశాడనీ, మార్క్సిస్టులు చూశారనీ, చూసితీరాలనీ మార్క్సిజం చెప్తుంది. మానవతా వాదం పేరుతో ఇక్కడ సుదర్శనం మార్క్సుని సూత్ర బద్ధమైన సాహిత్య అభిమానిగా కాక కేవల సాహిత్యాభిమానిగా చిత్రించాడు. అయితే ఈ అభిప్రాయానికి వ్యతిరేకంగా 'కమ్యూనిస్టు మేనిఫెస్టో'లో కొన్ని వాక్యాలు వున్నాయి. అవి అందరికీ తెలిసినవి కాబట్టి సుదర్శనం వాటిని పట్టించుకోక తప్పలేదు. తన అభిప్రాయాలకి అనుకూలంగా వాటిని మార్చటానికి వ్యాఖ్యాన శక్తి చాలక వంచనకి పాల్పడ్డాడు.

"ప్రతి యుగంలోనూ ప్రబలంగావుండే భావాలు, ఆ యుగ పాలకవర్గ భావాలే" ఈ వాక్యం ఆధారంగా రాజకీయవాది రచయితనూ, సాహిత్యవేత్తనూ తనకులొంగి ప్రవర్తించమంటున్నాడని సుదర్శనం నిర్ధారణ. మార్క్సిస్టు దృక్పథంలోని వర్గదృష్టిని సుదర్శనం వదులుకుంటే వదులుకోవచ్చు. కానీ మార్క్సును కూడా వదులుకోమనటమే దుర్మార్గం. మార్క్సు వర్గాన్నిగురించి చెప్తుంటే సుదర్శనం రాజకీయవాది అని వ్యాఖ్యానించటం కూడా వ్యక్తివాద వికారమే. మార్క్సు చెప్పాడు కాబట్టి లొంగి వుండటంకాదు. కవులూ, రచయితలూ, తత్వవేత్తలూ లొంగి వున్నారు కాబట్టే మార్క్సు చెప్పాడు. ఆర్థిక, సామాజిక రూపాన్నిబట్టి అన్ని యుగాల్లోనూ ఆలోచనాపరులు తెలిసో తెలీకో అధికారవర్గానుకూల భావాలనే ప్రధానంగా ఉత్పత్తి చేశారు. ఇది బూర్జువా రచయితల్ని గురించి మాత్రమే చెప్పింది కాదనీ వర్గసమాజంలో అన్ని యుగాలకీ సంబంధించినదనీ మేనిఫెస్టోలోనే వివరంగా వుంది. మార్క్సు సాధారణం ప్రత్యేకం రెండూ చెప్పాడు.

"వ్యక్తిగతంగా పరాధీనంగా వుండే సంబంధాలు మొదటి సామాజిక రూపాలు- విషయగత పరాధీనత మీద ఆధారపడిన వ్యక్తిగత స్వేచ్ఛ రెండవ సామాజిక రూపం. వ్యక్తుల సార్వజనీన అభివృద్ధి మీద, తమ సామాజిక సంపదగా సామూహిక, సామాజిక ఉత్పాదకతకి విధేయంగా వుండటం మీద ఆధారపడే స్వేచ్ఛా వ్యక్తిత్వం మూడవదశ"10

వర్గసమాజ తొలిదశల్లో రచయితలు పాలకవర్గాల మీద వ్యక్తిగతంగా ఆధారపడి వుంటారు. రాజులకీ, మంత్రులకీ పురోహితులకీ, మత ప్రవక్తలకీ, సేనాధిపతులకీ

అంకితాలు ఇవ్వటం సన్మానాలూ బిరుదులూ, స్వర్ణకంకణాలూ అగ్రహారాలూ పొందటం భూస్వామ్య సమాజంలో కవి వ్యక్తిగతంగా పాలకుల మీద ఆధారపడివున్నాడని చెప్పటానికి ప్రమాణాలు. బూర్జువా సమాజంలో కవి వ్యక్తిగతంగా స్వతంత్రంగా కనబడతాడు. కానీ వస్తుగత, విషయగత అధీనుడు. భూస్వామ్య సమాజంలో వెట్టిచాకిరీ చేసే వానినీ, పాలేరునీ, బూర్జువా సమాజంలో కార్మికుణ్ణీ పరిశీలిస్తే ఈ భిన్న సామాజిక రూపాల్లో రచయితకి ఉన్న స్థానాన్ని గుర్తించ వచ్చును. అధికార వర్గం అంటే దోపిడీవర్గం వుండదు కాబట్టి వాస్తవమైన స్వేచ్ఛా వ్యక్తిత్వం కమ్యూనిస్టు సమాజంలోనే సాధ్యం అని మార్క్స్ అభిప్రాయం. ఇలా మార్క్స్ వాక్యాల్ని చారిత్రికంగా, వర్గపరంగా అవగాహన చేసుకోకుండా అది బూర్జువా రచయితల్ని గురించి మాత్రమే అని ఎందుకు వ్యాఖ్యానిస్తున్నాడు సుదర్శనం? ఎందుకంటే తర్వాత సార్వజనీన సాహిత్యాన్ని గురించి ప్రస్తావించేటప్పుడు ఇబ్బంది రాకుండా వుండటానికి. ఒకడు మరొకడిని లొంగదీసుకుంటాడని చెప్పటానికి కూడా కొటేషన్లు కావాలా? సుదర్శనం డబ్బుసంచికీ, బూర్జువా సంపాదకులకీ, ప్రచురణకర్తలకీ ఫ్యూడల్ పండితులకీ విధేయంగా లేడా? చారిత్రిక నవలలో ముత్యాలహారాన్ని దైవసంకల్పానికి ప్రతీకగా సమర్థించింది (మోహనాంగి నవల. రాసింది కొండూరి వీరరాఘవాచార్యులు. దీనికి ముందు మాటలు సుదర్శనం రాసాడు) పండితాదరణ సంపాదించు కోటానికా? మానవతావాద ప్రదర్శనం కోసమా?

## బూర్జువా దశలో రచయిత

మార్క్స్ ప్రత్యేకంగా బూర్జువా దశలోని రచయితల స్థితిని గురించి చెప్పింది కూడా సుదర్శనం పేర్కొన్నాడు. ఇక్కడ మార్క్స్ విభిన్న సందర్భాల్లో, విభిన్న విషయాల్ని చెప్పిన వాక్యాల్ని కలిపి, అర్థాన్ని కప్పిపుచ్చి తనకు కావలసిన నిర్ధారణకు వచ్చాడు సుదర్శనం. బూర్జువా వర్గం పూర్వ సమాజ దశల్లోని సంబంధాల రూపాలన్నిటినీ ధ్వంసంచేసి, వాటి మత నైతిక ముసుగుల్ని తొలగించి, నగ్న ఆర్థిక సంబంధాన్ని మాత్రమే పైకి తెస్తుంది అని చెపుతూ, కవినీ, శాస్త్రజ్ఞుడ్నీ కూడా వేతన కూలీలుగా మార్చివేస్తుందని 'మేనిఫెస్టో'లో "బూర్జువాలు- కార్మికులు" అనే మొదటి భాగంలో చెప్పిన విషయాన్నీ "సోషలిస్టు - కమ్యూనిస్టు సాహిత్యం" అనే మానిఫెస్టో మూడవ భాగంలో "జర్మనీలో సోషలిస్టు, కమ్యూనిస్టు పేరు పెట్టుకున్న ప్రచురణలు ఏవో కొన్ని తప్ప మిగిలినవన్నీ కుళ్ళిన, నిర్జీవమైన సాహిత్యం కిందకే వస్తాయి"

అని చెప్పిన విషయాన్నీ అసంగతంగా కలిపి కోట్‌చేసి మార్క్స్ చెప్పిన దాన్ని తనకు వీలుగా వక్రీకరించు కున్నాడు.

ఇందులో మొదటి వాక్యాల్లో మార్క్స్ బూర్జువా సమాజంలోని మేధావుల స్థితిని గురించి విశ్లేషించాడు. రెండవ దానిలో 1847లో జర్మనీలో ప్రచారంలో వున్న పెటీ బూర్జువా నీచత్వానికి వాగాడంబర ప్రతినిధులుగా వుండి True Socialism పేరుతో ఊరేగిన కారల్‌గ్రిన్ వంటి వాళ్ళ తప్పుడు భావాల్ని నిరసించాడు. మార్క్స్ రాసిన వాక్యాలు ఇవి- "ట్రూ సోషలిజం జర్మనీ దేశాన్ని గొప్ప దేశంగానూ, జర్మన్ నీచ సంస్కారిని వుదాత్తమైన మానవుడుగానూ చిత్రించింది. ఈ అల్ప సంస్కార మానవుని ప్రతి దుష్టమైన హైన్యానికీ ట్రూ సోషలిజం ప్రచ్ఛన్నమైన, ఉన్నతమైన సోషలిస్టు భాష్యం చెపుతూ వాస్తవ స్వభావాన్ని కప్పి పుచ్చింది. "క్రూరమైన నిర్మూలనా" ధోరణిగా చిత్రిస్తూ కమ్యూనిజాన్ని తీవ్రంగా ప్రత్యక్షంగా వ్యతిరేకించే వరకూ వెళ్ళింది. అన్ని వర్గపోరాటాల విషయంలోనూ, తన తీవ్ర మైన పక్షపాతంలేని నిర్లక్ష్యాన్నీ, అసహనాన్నీ ప్రదర్శించింది. ఏవో కొద్ది రచనలు తప్ప సోషలిస్టు, కమ్యూనిస్టు ప్రచురణల పేరుతో ఇప్పుడు (1847) జర్మనీలో ప్రచారంలో వున్న రచనలన్నీ కుళ్ళిన, నిర్జీవమైన రచనలే "11. ఒక రచన సోషలిస్టు కమ్యూనిస్టు భావాలతో నిండి వున్నదా లేదా అనేదే ఇక్కడ మార్క్స్ చూసింది. సోషలిజంపేరుతో, కమ్యూనిజంపేరుతో కమ్యూనిస్టు వ్యతిరేకులు చేస్తున్న రచనల్నే ఈ సందర్భంలో మార్క్స్ కుళ్ళిన, నిర్జీవమైన రచనలుగా నిరసించాడు. ట్రూ సోషలిస్టులు సోషలిస్టులూ కారు, కమ్యూనిస్టులూ కారు. మార్క్స్ చూసిందాన్ని కాకుండా, తాను చూడదలుచుకున్న దాన్ని మార్క్స్ చూశాడని అంటున్నాడు సుదర్శనం. ఎందుకీ వక్రీకరణ వంచన? మార్క్స్ ఒక రచనని రచనగానే చూశాడు గానీ కమ్యూనిస్టు ఉద్యమానికి ఆ రచన దోహదం చేస్తోందా ద్రోహం చేస్తోందా అని చూడడని చెప్పటానికి. ఋజుత్వాన్ని కూడా వదులుకొని వాస్తవంగా మార్క్స్ చెప్పిన విషయాల్ని కప్పి పుచ్చి ఎలాగో ఈ ఇబ్బందిని తన వూహల్లో దాచాడు. మరొక సమస్య వచ్చిపడింది.

ఒక రచన బూర్జువా ఉత్పత్తి కింద ఎలా పరిగణించబడుతుంది? ఈ చర్చ ఎందుకు అవసరం అయింది సుదర్శనానికి? బూర్జువా వ్యవస్థ రచయితలూ మొదలైన మేధావుల్ని వేతన కూలీలుగా మార్చి వేస్తుంది అని మార్క్స్ అన్నాడు గదా! ఇది సుదర్శనం చెపుతున్న తాత్త్విక విషయికీ, భాషాశాస్త్ర సృజనకారుడికీ,

వ్యక్తి చేతనుడికీ, భావ స్వతంత్రుడికీ, ప్రత్యేక ప్రతిపత్తి గల రచయితకీ అన్వయించదని చెప్పటానికి. అందుకని జర్మన్ రచయితల్ని వాళ్ళ భావాల్ని ఆధారంగా చేసుకొని మార్క్స్ వాళ్ళ రచనల్ని నిరాకరించలేదని సుదర్శనం ముందుగా సిద్ధాంతం చేసుకున్నాడు. తర్వాత రచనని ఉత్పత్తిగా, బూర్జువా ఉత్పత్తిగా పరిగణించవచ్చునా లేదా అనే చర్చకి పూనుకున్నాడు. మార్క్స్ "అదనపు విలువ సిద్ధాంతాలు" అనే గ్రంథంలో మొదటి భాగం, నాలుగో అధ్యాయంలోనూ, దాని పన్నెండవ అనుబంధంలోనూ ఈ విషయాల్ని వివరంగా చర్చించాడు. సుదర్శనానికి సందర్భంతో పనిలేదు. ఒక కొటేషన్ దొరికితే చాలు తన అభిప్రాయానికి అనుకూలంగా మలుచుకోవటానికి ప్రయత్నించటమే. ఏ యుగంలో అయినా రచన ఉత్పత్తే. భౌతిక ఉత్పత్తి అయినా, భౌతికేతర ఉత్పత్తి అయినా సామాజికమే, పదార్థమూలమే.

"మనిషి చేసే ఇతర ఉత్పత్తులకి లాగానే అతని భౌతిక ఉత్పత్తికి కూడా ఆ మనిషే పునాది. ఉత్పత్తికి విషయం (Subject) అయిన మనిషిని మార్చే పరిస్థితులన్నీ అతని వ్యాపారాల్నీ, కార్యకలాపాల్నీ మారుస్తాయి. భౌతిక సంపదనీ, అమ్మకపు వస్తువుల్నీ సృష్టించే మనిషి కార్యాచరణనీ, వ్యాపారాల్నీ కూడా మారుస్తాయి. ఈ విషయం ఏ రూపంలో వున్నా. ఏ విధంగా కనిపించినా సర్వ మానవ వ్యాపారాలూ, కార్యకలాపాలూ భౌతిక ఉత్పత్తి మీద ప్రభావం చేస్తాయనీ, దాని మీద నిర్ణయాత్మక ప్రభావం వుంటుందనీ నిరూపించవచ్చును "12

మనిషి చేసే భౌతిక ఉత్పత్తికీ తాత్త్వక ఉత్పత్తికీ గల గతితార్కిక భౌతిక సంబంధాన్ని మార్క్స్ ఈ వాక్యాల్లో విశ్లేషించాడు. ఉత్పత్తిని గురించి పరిశీలించేటప్పుడు గతితార్కిక భౌతిక, చారిత్రిక దృష్టిని విస్మరించకూడదు. తాత్త్వక ఉత్పత్తికీ భౌతిక ఉత్పత్తికీ పరస్పర చర్యా సంబంధాన్ని నిర్దిష్ట ఆర్థిక - సామాజిక రూపం దృష్ట్యానే వివరించాలి. భూస్వామ్య ఉత్పత్తి విధానానికీ, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికీ అనుగుణ్యంగా వుండే తాత్త్వక ఉత్పత్తులు విభిన్నంగానూ వుంటాయి. విభిన్న రకాలుగానూ వుంటాయి. పునాదిగా వుండే భౌతిక ఉత్పత్తిని పరిశీలనలోకి తీసుకోకపోతే, తాత్త్వక ఉత్పత్తిని అపగాహనచేసుకునే అవశ్యసాధనాన్ని వదులుకున్నట్టే. అప్పుడు తాత్త్వక ఉత్పత్తులకి తలా తోకా లేని నిర్జీవ స్వతంత్ర చరిత్రలు రాసుకోవటం తప్ప గత్యంతరం వుండదు. అసలు వస్తు క్రమాల్ని వదులుకొని మాటల గారడీ రూపంలో వున్న వస్తువుల్నే వాస్తవ వస్తువులని భ్రమ పడటం జరుగుతుంది.

## ఉత్పాదక శ్రమ - అనుత్పాదక శ్రమ

ఉత్పత్తి శ్రమశక్తి ఫలితం. సాహిత్యంవంటి తాత్త్వికఉత్పత్తి ఉత్పత్తి అవునా? కాదా? అని కాదు మార్క్స్ చర్చించింది. అది ఉత్పాదక శ్రమా (Productive Labour)లేక అనుత్పాదక శ్రమా (Un Productive Labour) అనేదే మార్క్స్ చర్చకి తీసుకుంది. మానసిక, శారీరక శ్రమలుగా శ్రమ విభజన జరిగిన వర్గ సమాజం అంతటా తాత్త్విక ఉత్పత్తులు అనుత్పాదక శ్రమలే. రాజులూ, పురోహితులూ, సేనాధిపతులూ, గాయనీ గాయకులూ, వైతాళికులూ, మంత్రులూ, మత ప్రవక్తలూ, నాట్యాచార్యులూ, వేదాంతులూ భూస్వామ్య సమాజంలో అనుత్పాదక శ్రామికులే. అయితే వీళ్ళకి ఆ సమాజంలో ఊహాజనిత 'అలౌకిక' ప్రతిష్ఠ వుండేది. ఆ దశలోని అనుత్పాదక శ్రామికులకి కొన్ని మూఢ విశ్వాసాలవల్ల కర్మకాండ ప్రతిష్ఠని (Ritual Status) నిలబెట్టారు. బూర్జువా సమాజంలో అనుత్పాదక శ్రామికుల ప్రతిష్ఠ గుణాత్మకంగా మారిపోయింది. భూస్వామ్య సమాజంలో ఉత్పత్తి ఉపయోగ విలువగా (Use - Value) వుంటుంది. బూర్జువా సమాజంలో ఉత్పత్తికి మారక విలువ (Exchange - Value) వుంటుంది. అమ్మకపు సరుకుల ఉత్పత్తి పెట్టుబడిదారీ ఆర్థిక విధానానికి ప్రాణం. కాబట్టి పెట్టుబడిదారీ కోణం నుంచీ ఉత్పాదక శ్రమ అంటే, అదనపు విలువని ఉత్పత్తి చేసే శ్రమ. పెట్టుబడితో మారకం చేయబడేది ఉత్పాదక శ్రమ. ఆదాయంతో మారకం చేయబడేది అనుత్పాదక శ్రమ. ఈ ఉత్పాదక, అనుత్పాదక శ్రమల మధ్య తారతమ్యం శ్రమ ప్రతీక రూపం మీద కానీ, శ్రమ రూపొందించిన ప్రత్యేక ఉపయోగ విలువ మీద కానీ ఆధారపడివుండదు. పెట్టుబడిదారీ ఉత్పత్తి కోణం నుంచీ అమ్మకపు సరుకుని ఉత్పత్తి చేయటం, కేవల ఉపయోగ విలువని ఉత్పత్తి చేయటం మీద ఆధారపడి వుంటుంది.

"అమ్మకపు సరకుల్ని వుత్పత్తి చేసేది ఉత్పాదకశ్రమ. వ్యక్తిగత చాకిరీలను (ఆసన పరిచారికత్వం) ఉత్పత్తి చేసేది అనుత్పాదకశ్రమ. మొదటి శ్రమశక్తి అమ్మకపు వస్తువుల రూపాన్ని పొందుతుంది. రెండవశ్రమ చేస్తున్నప్పుడే వినియోగించుకొనితీరాలి. వస్తువుల రూపంలో అస్తిత్వంలోఉండే భౌతికమైన, బౌద్ధికమైన సంపద అంతా ఉత్పాదక శ్రమ పరిధిలోకి వస్తుంది. అది మాంసంకావచ్చు, పుస్తకాలు కావచ్చు. వస్తువుల రూపంలోఉంటే ఉత్పాదకశ్రమ ఫలితాలే. ఊహాత్మకమైన లేదా వాస్తవమైన వ్యక్తి అవసరాల్ని సంతృప్తిపరిచేవన్నీ అనుత్పాదక శ్రమ

పరిధిలోకి వస్తాయి. వ్యక్తిమీద అతని ఇష్టానికి వ్యతిరేకంగా బలవంతంగా రుద్దేవి కూడా అనుత్పాదక శ్రమకి సంబంధించినవే" 13 కళ వస్తురూపాన్ని పొందినపుడు– అంటే పుస్తకాలు, విగ్రహాలూ, చిత్రపటాలుగా మారినప్పుడు అవి అమ్మకపు సరకులే. వీటికీ తక్కిన ఉత్పత్తులకీ తేడా ఏమీఉండదు. అవన్నీ భౌతికఉత్పత్తులే. ఈ అనుత్పాదక శ్రమలో మరొకరకం ఉంది. నటునిలోఉండే అభినయకళని సరకు రూపంలో, వస్తువుగా సరకురూపంలో థియేటర్ యజమాని అమ్మలేడు. నటన రూపంలోనే కొనగలడు, అమ్మగలడు. పుస్తకాలూ, విగ్రహాలూ, చిత్రపటాలూ కళాకారుడికీ వినియోగ దారుడికీ స్వతంత్రంగా వస్తువుల రూపంలో ఉంటాయి కనుక అమ్మకపు వస్తువులుగా ఉంటాయి. నటులూ, ఉపన్యాసకులూ, గాయకులూ, 'ప్రదర్శించే కళాకారులు' (Performing artists). వాళ్ళ కళను వాళ్ళ నుంచీ విడదీసి వస్తురూపంగా చేయలేం. ఇక్కడ కళాకారుడికీ ప్రజలకీ కళాసంబంధం వుంటుంది. నిర్మాత లేదా హాలు యజమానికీ నటుడికీ ఉత్పత్తి శ్రామికుని సంబంధమే వుంటుంది. కాబట్టి అనుత్పాదక శ్రామికులు రెండు రకాలుగా వుంటారు. సుదర్శనం భ్రమపడుతున్నట్టు మార్క్స్ ఈ సందర్భంలో చర్చిస్తున్నది, రచన ఉత్పత్తి అవునా, కాదా అని కాదు. అది ఉత్పత్తే. కాని అనుత్పాదక శ్రమ ఉత్పత్తి. "ప్రతి చాకిరీ దాన్ని అమ్ముకునేవాడికి ఉత్పాదక శక్తిగానే వుంటుంది "14

## "సహజ ధర్మం"

ఇక మిల్టన్ ప్రస్తావన. "మిల్టన్ పారడైజ్ లాస్ట్ రాశాడంటే అది పట్టు పురుగు పట్టును ఉత్పత్తి చేయటం వంటిది. అది అతడు అభ్యాసం నుంచి పొందిన నైపుణ్య కార్య ఫలితం"15 ఇందులో చివరి మాట "It was an activity of his nature" అనేదాన్ని సుదర్శనం 'అది అతని సహజధర్మం అని' అనువాదం చేసాడు. "సహజ ధర్మం" అంటేఏమిటి? తెలుగులోనూ, సంస్కృతంలోనూ కూడా పుట్టుకతో వచ్చేదనీ, శాశ్వతంగా మార్పు లేకుండా ఉండేదనే అర్థంలో 'సహజధర్మం' అని వాడుతుంటారు. Activity, Nature అనే మాటలకి మార్క్సు పరిభాషలో సహజ ధర్మం అని అర్థం కాదు. సహజధర్మం అగర్భంగానో, వ్యక్తిలో వివరణకీ, విశ్లేషణకీ అందని 'ప్రతిభ' రూపంలోనో వుంటుందని అర్థం కాదు.

"స్వభావరీత్యా మనిషి సామాజిక జీవి అయినప్పుడు అతడు తన నిజస్వభావాన్ని సమాజంలో మాత్రమే అభివృద్ధి చేసుకుంటాడు. మనిషి స్వభావంలోని శక్తుల్ని

సమాజానికి విడిగా వుండే వ్యక్తికి సంబంధించిన శక్తులుగా కాక, సామాజిక శక్తితోనే కొలవ వలసి వుంటుంది."16 మానవుడు సమాజ సభ్యుడయినప్పుడు అతని వాస్తవ స్వభావం సమాజం నుంచీ మాత్రమే అభివృద్ధి పొందుతుంది. మనిషి శక్తిని ప్రత్యేక వ్యక్తి శక్తిగా కాక సామాజిక శక్తితోనే అవగాహన చేసుకోవాలి. విడిగా వ్యక్తిలో శక్తి ఏమీ ఉండదు. సామాజిక స్వభావం కూడా ఎప్పుడూ ఒకే రకంగా ఉండదు. అది అమూర్త పదార్థం కాదు. "మానవులకు అందుబాటులో వుండే ఉత్పత్తి శక్తులమొత్తం సమాజ స్వభావాన్ని నిర్ణయిస్తుంది." 17 వ్యక్తిస్వభావం సమాజ స్వభావంతో నిర్ణయింపబడితే, సమాజ స్వభావం ఆ సమాజంలోని మానవులకి అందుబాటులోఉన్న ఉత్పత్తి శక్తుల మొత్తంతో నిర్ణయించ బడుతుంది. డాక్టర్లూ, ఇంజనీర్లూ తత్వవేత్తలూ, రచయితలూ ఏ విద్యలో నైపుణ్యం సంపాదించాలన్నా సమాజంలో సమాజంనుంచి సంపాదించవలసిందే. వ్యక్తికయినా సమాజానికయినా "ప్రతి ఉత్పాదక శక్తీ ఆర్జిత శక్తే- పూర్వ కార్యాచరణ ఫలితమే."18 కాబట్టి సుదర్శనం Nature అంటే ధర్మం అని వివరించటం వేదాంత పరిభాషకి సరిపోతుంది కానీ గతితార్కిక భౌతికవాద దృష్టిలో తప్పు. వ్యక్తులు ఏ రంగంలో అయినా నైపుణ్యాన్ని నిర్దిష్ట సమాజంలో సంపాదించుకునేదే. దానంతటది ఏదీ రాదు.

"శ్రమ శక్తి పెట్టుబడిని ఉత్పత్తి చేయకుండా, డబ్బుతో ప్రత్యక్షంగా మారకం చేయబడినప్పుడు అది ఉత్పాదక శ్రమ కాదు. అది సేవరూపంలో వుంటుంది. ఈ సేవ శ్రమ శక్తికి సంబంధించిన ఇతర అమ్మకపు వస్తువుల వంటిదే. ఇది ఒక నిర్దిష్టమైన ఉపయోగ విలువను చెప్పే మాట మాత్రమే. వస్తు రూపంలో కాక కార్య రూపంలో సేవ చేసే పరిధిలోని ఉపయోగ విలువకి సేవ నిర్దిష్ట పదం మాత్రమే. ఇది యంత్రంకన్నా, గడియారంకన్నా ఏ విధంగానూ భిన్నమైంది కాదు "19 అనుత్పాదక శ్రమ వస్తువుల రూపంలో వుండదు. చైతన్యవంతమైన క్రియా రూపంలో వుంటుంది. దీన్నే మార్క్స్ 'Activity' అన్నాడు. 'సృజన' అంటే కూడా ఇదే అర్థం. ప్రతిభావంతుడంటే తన తలకాయలో నుంచి వస్తువుల్ని కల్పించేవాడు కాదు, తన బుర్రలో నుంచీ ఊహల్ని అల్లగలిగే వాడూ కాదు. చిక్కుగా వుండే సంఘటనల నుంచి, చిందరవందరగా గజిబిజిగా వుండే సంకీర్ణ జీవిత సంబంధాల నుంచీ దాగివున్న శక్తిని ముఖ్యమైన సత్యాన్ని ఆవిష్కరించేవాడు. ఆ ముఖ్యమైన, యాదృచ్ఛికమైన విషయాల నుంచీ జీవిత వాస్తవికతని చిత్రించ గలిగినవాడు. పట్టు పురుగు పట్టును ఉత్పత్తి చేస్తున్నట్టు మిల్టన్ కవిత్వం రాశాడంటే కూడా పోలికని సక్రమంగా అర్థంచేసుకోవాలి. పట్టును జనం ఉపయోగించుకున్నట్టే,

మిల్టన్ కవిత్వాన్ని జనం ఉపయోగించుకుంటారు. ఉత్పత్తిలో పట్టు పురుగునీ, మిల్టన్‌నీ 'సహజ ధర్మం' కోసం పోల్చకూడదు. అలా పోల్చటం మార్క్స్ శ్రమ సిద్ధాంతానికి విరుద్ధం. "జంతువు దాని జీవిత కార్యాచరణలో ఏకంగా వుంటుంది. అది లక్ష్యాన్ని వింగడించుకోలేదు. అది దాని కార్యాచరణ. కానీ మనిషి తన జీవిత కార్యాచరణనే తనసంకల్పానికీ, చైతన్యానికీ విషయంగా (Object) చేసుకోగలడు. అతనికి చైతన్యవంతమైన జీవిత కార్యాచరణ వుంది."[20]

పట్టు పురుగు పట్టుని ఉత్పత్తి చేయటం దాని జీవిత కార్యం. తాను పట్టును ఉత్పత్తి చేస్తున్నాననీ, దాన్ని జనం ఉపయోగించుకుంటారనీ దానికి తెలీదు. పట్టు దాని జీవిత లక్ష్యంకాదు. పట్టు నుంచి తనను వేరుగా చూసుకోలేదు. కానీ మనిషి జీవిత కార్యాచరణని తన సంకల్పానికీ, చైతన్యానికీ లక్ష్యంగా చేసుకోగలడు. అతనికి చైతన్యవంతమైన సృజన శక్తి వుంది,

మార్క్స్ మరొక సందర్భంలో కూడా మానవ శ్రమకీ తక్కిన జంతువుల శ్రమకీ తేడా చెప్పాడు. సాలెపురుగు గూడు కడుతుంది. కానీ దానికి గూడు కడుతున్నానన్న భావం వుండదు. మనిషి గుడిసె వేసుకుంటాడు. అయితే మనిషికి గుడిసెని గురించిన భావం వుంటుంది. ఆ భావాన్నే శ్రమలో సాధిస్తాడు. ఆ భావం పూర్వ శ్రమానుభవం నుంచి ఆర్జించిందే. మిల్టన్ పారడైజ్ లాస్ట్ రాయకుండా వుండగలడు. అదే ఆయన జీవితం కూడా కాదు. తాను రాస్తున్నట్టు ఆయనకు తెలుసు. చెప్పదలుచుకున్నది చెప్పాడు. కాబట్టి సుదర్శనం ఉత్పత్తికీ, శ్రమ క్రమానికీ సంబంధించిన మార్క్స్ పరిభాషని అర్థం చేసుకోకుండా 'సహజ ధర్మం' అని వ్యాఖ్యానించటం అశాస్త్రీయం.

బూర్జువా ఉత్పత్తి విధానంలో ఉత్పాదక, అనుత్పాదక శ్రమలను గురించి మార్క్స్ వివరణ నుంచి సుదర్శనం చేసిన నిర్ధారణ ఏమిటి? మార్క్స్ మానవతా దృక్పథం సరిగ్గా అవగాహన చేసుకోవటానికి ఇది మంచి సందర్భం అట. సుదర్శనానికి తప్ప మతి వున్న మరెవరికీ ఇక్కడ మానవతావాదం కనిపించదు. బూర్జువా సమాజంలో శ్రమని గురించీ, ఉత్పత్తిని గురించీ మార్క్స్ చేసిన విశ్లేషణ. బూర్జువాలు కొన్ని తాత్త్విక ఉత్పత్తులకి- కళలకీ, కవిత్వానికీ- శత్రువులనే విషయాన్ని నిరూపిస్తున్నదని ఎవరికయినా అర్థం అయ్యే విషయం. సుదర్శనానికి కావాల్సింది వున్న వాస్తవంకాదు. ఒక రచనని కమ్యూనిస్టులు బూర్జువా రచనగా పరిగణించటానికి అది బూర్జువా ఉత్పత్తా కాదా అని చూడాలి కానీ, ఆ రచనలో భావాలు పాలక

వర్గాన్ని సమర్థిస్తున్నవా, విప్లవ వర్గాన్ని సమర్థిస్తున్నవా? అని చూడ కూడదట. శ్రీశ్రీ "మహాప్రస్థానం" 50వేల కాపీల్ని విశాలాంధ్ర ప్రచురణకర్తలు అమ్మారు కాబట్టి మహాప్రస్థానం బూర్జువా రచన. సుదర్శనం రాసిన "నిశాంతం" ఎవడూ కొనలేదనుకోండి. అందుకని ఆ రచన బూర్జువా రచన కాదు. ఇదీ సుదర్శనం చెపుతున్న మార్క్స్ మానవతావాదం. దీని కోసం జర్మనీలో మార్క్స్ తన కాలం నాటి రచనల్ని భావాలు గీటురాయిగా విమర్శించలేదని ఒక అబద్ధాన్ని సిద్ధంచేసుకున్నాడు కదా? సుదర్శనం వండిన మార్క్స్ మానవతావాదాన్ని గ్రహించలేక మార్క్సిస్టు రాజకీయవాదులు రచయితని ఉత్పత్తి శ్రామికునిగా దిగజారుస్తూ రచయిత శక్తిని రాజకీయాలకి పెట్టుబడిగా మార్చుకుంటున్నారట. ఏ దేశంలోనో, ఏ గ్రహంలోనో మనకి తెలీదు. "మేర మీరిన" మూర్ఖత్వం అంటే ఇదే. "రాజకీయ పెట్టుబడి" మార్క్స్ ప్రత్యేకంగా సుదర్శనానికి బోధించినట్టున్నాడు. బూర్జువా మేధావులు దేన్ని గురించి అయినా పెట్టుబడి, లాభం - ఆదాయం - పరిభాషలోనే ఆలోచిస్తారు. బూర్జువా వర్గాన్ని ప్రత్యక్షంగా కానీ పరోక్షంగా కానీ సమర్థించే రచనల్ని కమ్యూనిస్టులు బూర్జువా రచనలు అంటారు. ఇది రచన ఉత్పత్తికి మాత్రమే సంబంధించిన సమస్యకాదు. రచనలోని వస్తువుకి సంబంధించింది. మిల్టన్-

"అందుచేత దేవుని సనాతన శాసనం
న్యాయమైన భయం కారణంగానే
పురుషుడికి స్త్రీ మీద
నిరంకుశ అధికారాన్ని ప్రసాదించింది." 21

అని స్త్రీని పురుషుని బానిసగా చిత్రించటాన్ని ఫ్యూడల్ దృక్పథంగా, స్త్రీని అవమానించే అభిప్రాయంగా, దేవుని పేరుతో మానవతని కళంకపరిచే నీచ విషయంగా పరిగణించి మార్క్సిస్టులు తిరస్కరిస్తారు.

## సార్వకాలిక, సార్వజనీన దృష్టి

మార్క్స్ నుంచి చారిత్రిక భౌతికవాదాన్నీ, వర్గపోరాట సిద్ధాంతాన్నీ లాగి పారేసి మానవతావాదాన్ని కనిపెట్టి సాహిత్యం విషయంలో మార్క్స్ దృష్టి సార్వకాలికం, సార్వజనీనం అని నిరూపించటానికి సిద్ధం అయ్యాడు.

విశ్వజనీన కళాసృష్టి, సాహిత్య సార్వకాలికతలవంటి వాటిని పండితులు చాలా కాలం నుంచి ప్రచారం చేస్తున్నారు. పరిపాలనలోకి వచ్చిన వర్గం తన అధికారం

శాశ్వతం అని భావిస్తుంది. తన పాలన సార్వజనీనం అనే భ్రమ కలిగించటానికి ప్రయత్నిస్తుంది. ప్రాచీన సాహిత్యాన్ని గురించి మార్క్స్ చేసిన పరిశీలనలకి ఆ పరిశీలనల్లోనే సమాధానం వుంది. తన భావాల్ని మార్క్స్ వాక్యాల్లో చూడటంతో సుదర్శనం మార్క్స్ ప్రతిపాదనల్లోని గతితర్కాన్ని విస్మరించాడు. కొన్ని యుగాల్లోని కళల అభివృద్ధికీ అనాటి సామాజిక వాస్తవికతకీ స్థూల దృష్టితో చూస్తే అనుగుణ్యత కనిపించదు. కొన్ని పాత ప్రక్రియలు- ఇతిహాసం వంటివి- ఆధునిక యుగంలో ఉత్పత్తిచేయటం సాధ్యం కాదు. కళల్లో విభిన్న ప్రక్రియల విషయంలోనే ఈ అసమత వుంటే, మొత్తం కళారంగానికీ సమాజ సాధారణ పురోగమనానికీ ఇంకా ఎక్కువ అసమత కనిపించవచ్చును. అయితే ఇక్కడ శాస్త్రీయమైన నిర్దిష్టమైన పద్ధతుల్లో పరిశీలిస్తే, ఈ వైరుధ్యాన్ని పరిష్కరించవచ్చును.

గ్రీకు పురాణాలకి గ్రీకులజీవితం పునాదిగా ఉంటుంది కానీ భారతీయ లేదా ఈజిప్షియన్ జీవితం పునాదిగా ఉండదు. సుదర్శనం చెప్పే విశ్వజనీనత ఇక్కడే ఎగిరిపోయింది. గ్రీకుల కళకి గ్రీకుపురాణం కోశాగారం మాత్రమేకాదు, ఆధారం కూడా. ఏదేశంలో అయినా ఆదేశపు ఆదిమ ప్రజలమాయ, కర్మకాండలు (Magic and Rituals) కళాకృతిని పొందిన పురాణాలకి ఆధారంగా ఉంటాయి. గ్రీకుల ప్రాచీన కళలోవున్న ఊహలకి పునాది అయిన గ్రీకుల ప్రకృతి భావన, సమాజ సంబంధాల భావన విజ్ఞానశాస్త్రం వికసించిన ఆధునిక యుగంలో సాధ్యంకావు. ప్రకృతి శక్తుల్ని ఊహలో, ఊహనుంచి లొంగదీసుకొని అధికారం చెలాయించినట్టు పురాణం కల్పన చేస్తుంది. అందుచేత ప్రకృతి శక్తులమీద వాస్తవ అధికారం పొందగానే ఊహామాత్ర అధికారం అదృశ్యం అయిపోతుంది. గ్రీకులకళకి గ్రీకుల జీవితంతోపాటు గ్రీకుపురాణం ఆధారంగా పూర్వరంగంగా ఉంటుంది. అంటే అనాటికే సామాజిక, ప్రాకృతిక దృగంశాలు ప్రజల ఊహల్లో అనుద్దిష్ట కళాత్మక మార్గంలో (Unintentionally artistic manner) లీనమైఉంటాయి. మాయలో, కర్మకాండలో, పురాణంలో ప్రజలఊహలు అనుద్దిష్ట కళామార్గంలో ఉండటానికి సమాజ అపరిణిత వ్యవస్థ కారణం. ఆదిమ సాహిత్యాన్ని పసిపిల్లలతో పోలిస్తే, పసిపిల్లల్లోఉండే శాశ్వత ఆకర్షణ పురాణాలకి ఉంటుందని గ్రహించవచ్చును. ఎగిరే పక్షుల్నిచూసి మనిషికి పక్షి రెక్కలవంటివి కల్పించి గగన విహారాన్ని చిత్రించటంలాంటి, మానవ అవయవాల్ని అటూ ఇటూమార్చి సంకరంచేసి, సంఖ్యనుపెంచి దేవతల రూపాల్ని వూహించటంవంటి పౌరాణిక కల్పనల్ని 'సానుబంధప్రవృత్తి' (associative complex) అంటారు. ఇది పిల్లలకీ పురాణ కవులకీ సమాన లక్షణం. పెరిగినవాడు పసిపిల్లవాడు

కాలేనట్టే, పరిణిత సమాజఉత్పత్తి అయిన ఈనాటి సాహిత్యం అపరిణిత సమాజ ఫలితం అయిన తొలిసాహిత్యాన్ని ఉత్పత్తి చేయటం సాధ్యంకాదు. ఎవడయినా ఇప్పుడు పురాణాల నమూనాలో ఏ వరాహ పురాణమో రాసినా అది ఎదిగిన పెద్దవాడు చిన్నపిల్లల్లాగా 'ఉంగా, ఉంగా' అనట్టువుంది ఎబ్బెట్టుగా, సహించరానిదిగా ఉంటుంది. అచ్చుయంత్రం వచ్చింతర్వాత, పురాణాలవంటి మౌఖిక కవిత్వం సాధ్యంకాదు. విమానంవచ్చిన తర్వాత ఎవడన్నా ఒకడు ఒకస్త్రీని పుష్పకవిమానంమీద లేవదీసుకు పోయాడనిరాస్తే ఆధునిక పాఠకులు సహించలేరు. కాబట్టి ఆధునిక యుగంలో తొలి కళారూపాలవంటి వాటిని సాధించలేక పోవటానికి విభిన్న సామాజిక వ్యవస్థలే కారణం. ఇందులో సుదర్శనం గంతులేసి చెబుతున్న వివరణకి అసాధ్యమైన విషయం ఏమీలేదు.

"గ్రీకు కళ, గ్రీకు ఇతిహాస కవిత్వం సామాజిక అభివృద్ధికి సంబంధించిన కొన్ని రూపాలకి ఎలా అనుగుణ్యంగా వున్నవి అనేది అవగాహన చేసుకోవటం కాదు మన సమస్య. సమస్య ఏమంటే అవి ఇప్పటికీ మనకి ఆనందాన్ని కలిగించటం, కొన్ని విషయాల్లో ప్రమాణ పూర్వకంగా వుండి, సాధించలేని ఆదర్శంగా వుండటం."[22]

గ్రీకుకళకీ పురాణానికీ నిర్దిష్ట సామాజిక వాస్తవికతకీ సంబంధాన్ని చెప్పటం కష్టంకాదు. కాబట్టి మార్క్సుకి సాహిత్య సార్వకాలిక భావనని అంటగట్టటానికి ప్రమాణం లేదు. చిన్నపిల్లలు మనల్ని ఆకర్షించగలిగినట్టే చారిత్రికంగా బాల్యదశలో పుట్టిన కళ కూడా మనల్ని ఆకర్షిస్తుంది. పునరావృత్తంకాని దశలోని కళ కాబట్టే మనల్ని ఆకర్షిస్తోంది, ఆకట్టుకోగలుగుతోంది. ఆ కళ మనల్ని ఆకర్షించటానికీ, ఆ కళ పుట్టిన అపరిణిత సామాజికదశతో మనకి ఘర్షణరాదు దాని సౌందర్యం అపరిణిత చారిత్రికదశ ఫలితం. కాబట్టి సుదర్శనం భ్రమపడుతున్నట్టు కాక, "విశ్వజనీన, సార్వకాలిక కళా సృష్టి"ని సూత్రీకరించటమే కాక గతితార్కిక చారిత్రిక భౌతికవాద పరంగా విశ్లేషించి వివరించాడు మార్క్సు. ప్రాచీన పురాణాల వంటి ఆదిమ కళాకృతుల్ని ఇప్పటికీ మనం ఆసక్తితో చదవటానికి పసిబిడ్డ ఆకర్షణ పోలికతో తిరుగులేని వివరణఇచ్చాడు.

## అవశ్యకత – స్వేచ్ఛ, సృజన

రచయిత విశిష్ట వ్యక్తి. అతనికి స్వతంత్ర ప్రతిపత్తి వుంది. రచన సృష్టి. అది సార్వకాలికం, సార్వజనీనం, నిత్యనూతనం. రచన ఉత్పత్తి కాదు.

రచనకి మూలమైన సృజన మానవ సహజధర్మం. అది స్వేచ్ఛకి లక్షణం. సృజన స్వేచ్ఛఫలితం. భౌతిక అవశ్యకతని అధిగమించే మానవస్వేచ్ఛనుంచీ సృజన వికసిస్తుంది భౌతిక ఆవశ్యకతనించి సృజనని సూత్రీకరించటం, నియమించటం సాధ్యంకాదు. ఇవి మార్క్స్ అభిప్రాయాలని సుదర్శనం రెండు కొటేషన్లను దుర్వ్యాఖ్యానంచేసి ఉద్ఘాటించాడు. రచయితకానీ మరొకడుకానీ విశిష్ట వ్యక్తికాదనీ, అందరిలాంటి వ్యక్తేననీ, రచయితకి స్వతంత్ర ప్రతిపత్తిలేదనీ ముందే వివరించటం జరిగింది. అలాగే సార్వకాలిక, సార్వజనీన నిత్యనూతన సాహిత్యం ఉండదనికూడా నిరూపించటం జరిగింది. వర్గరహిత సమాజంలోకూడా పాతకీ కొత్తకీ ఘర్షణ ఉంటుంది. నిత్యనూతనంగా ఉండేది ఏమీఉండదు.

ఇక ఆవశ్యకత- స్వేచ్ఛల్ని గురించీ వాటితో సృజనకిఉన్న సంబంధం గురించీ సుదర్శనం అవగాహన మార్క్సిస్టు దృక్పథానికి పూర్తిగా విరుద్ధం అయింది. మార్క్స్ వాక్యాలకిఉండే గతితార్కిక పునాదినీ, వర్గదృష్టినీ నిర్లక్ష్యంచేస్తూ వక్రీకరించి, తనకు కావాల్సిన నిర్ధారణల్ని చేయటం సుదర్శనం పంథా. ఆవశ్యకత స్వేచ్ఛ కలిసేఉంటాయి. ఆవశ్యకతకీ స్వేచ్ఛకీవుండే ఘర్షణలో మనుషులు ఆవశ్యకతని గుర్తించి స్వేచ్ఛని విస్తృతం చేసుకుంటారు. వస్తుసూత్రాల్ని అవగాహన చేసుకోకుండా వస్తువుల్ని మార్చటం సాధ్యంకాదు. బాహ్యప్రపంచంలోని వస్తువుల సూత్రాలు తెలీకపోతే, మనిషి వస్తుసూత్రాలకి బానిసగా ఉంటాడు. ఏ మేరకి వస్తుసూత్రాల్ని తెలుసుకుంటాడో ఆమేరకే స్వేచ్ఛని సంపాదిస్తాడు. ఇక్కడ వస్తుసూత్రాల అవగాహన ఆవశ్యకత.

స్వేచ్ఛ ఎవరికోసం, స్వేచ్ఛ ఏమిచేయటంకోసం అనే ప్రశ్నలకి ముందు సమాధానం చెప్పుకోవాలి. వ్యక్తుల కార్యాచరణ లేకుండా సమిష్టి కార్యాచరణ అసంభవం. అలాగే వ్యక్తులకి స్వేచ్ఛలేకుండా సామూహిక స్వేచ్ఛ అసంభవం. స్వేచ్ఛాసమాజం అంటే వ్యక్తులు స్వేచ్ఛగా సంఘటితంకావటం. సమాజంలో ప్రతివ్యక్తికీ స్వేచ్ఛ లేకపోతే సమాజంలో స్వేచ్ఛలేనట్టే. స్వేచ్ఛకీ సమానత్వానికీ సన్నిహితమైన సంబంధంవుంది. సమతలేకపోతే అందరికీ స్వేచ్ఛ సాధ్యంకాదు. సమత స్వేచ్ఛకి షరతు. సామాజిక మానవుడికి మాత్రమే స్వేచ్ఛఉంటుంది. అలాంటి సామాజిక స్వేచ్ఛలోనే శ్రమచేయటం వ్యక్తికి భారంగా కాక, సంతోషదాయకంగా ఉంటుంది. ప్రతివ్యక్తినీ ఒకవృత్తికీ, ఒకశ్రమరూపానికీ కట్టివేసే పద్ధతి స్వేచ్ఛకి విరుద్ధం. తమ ఉత్పత్తి సాధనాలకి తామే బానిసలు కావటం

వ్యక్తుల్లో అనేక శక్తులు ఎండిపోవటానికి కారణం అవుతుంది. వ్యక్తి బహుముఖ వికాసం స్వేచ్ఛనుంచే సాధ్యం అవుతుంది. ప్రతివ్యక్తిలోని భౌతిక, భౌతికేతర శక్తుల్ని వికసింపచేసే, వినియోగించేసే స్వేచ్ఛనే స్వేచ్ఛ అంటారు. స్వేచ్ఛ అనేది తాత్త్వక విషయం కాదు. భౌతిక విషయాల్తో సంబంధంలేని స్వేచ్ఛ స్వప్నస్వేచ్ఛ. ఆవశ్యకతా సూత్రాలు తెలిసినవాడికే స్వేచ్ఛ వుంటుంది. వ్యక్తి పదార్థజీవి కానీ, తాత్త్వకజీవి కాడు. వ్యక్తి పదార్థ అస్తిత్వం (Material Existance) అతనిస్వేచ్ఛకి పరిమితి కాదు, నియతి (Condition) భౌతిక అస్తిత్వం ఆవశ్యకతల్ని అవగాహన చేసుకోవటంమీద స్వేచ్ఛాసాధన ఆధారపడి వుంటుంది.

ఆవశ్యకత అనే మాట విభిన్న సందర్భాల్లో విభిన్నమైన అర్థాల్లో వాడు తున్నారు. ఆవశ్యకత అంటే అవశ్యనియతి (Necessary Condition) అని అర్థం. తిండి తినటం జీవితానికి ఆవశ్యకత అన్నాం అంటే, ఎప్పుడూ ఏదో ఒకటి తింటూ వుండాలి అని అర్థంకాదు. తినకపోతే బతకలేం అని అర్థం. పని గంటల్ని తగ్గిస్తే వాస్తవ స్వేచ్ఛ లభిస్తుంది అంటే ఇతర పనులు చేసుకోవటానికి సమయం దొరుకు తుందని అర్థంకానీ, మనకి ఇష్టంవున్నా లేకపోయినా ఏదో ఒకపని చేసితీరాలని అర్థం కాదు. మనకి ఆసక్తివున్న పనులన్నీ చేయవచ్చునని అర్థం. ఎవరికయినా, ఏ పని చేయటానికయినా స్వేచ్ఛ వుండటం అంటే, ఆ పని చేయటానికి సాధనాలు అందు బాటులో వుండాలి. ఆ పని చేయటానికి అవసరమైన పరిజ్ఞానం పొందాలి. మానవ స్వేచ్ఛని మానవులే సాధించుకుంటారు. స్వేచ్ఛ చరిత్ర పురోగమన ఫలితమే.

భౌతిక ప్రపంచం, దాని సూత్రాలూ మానవస్వేచ్ఛకి అవరోధాలని మార్క్స్ భావించినట్టు సుదర్శనం భ్రమపడుతున్నాడు. ఇక భౌతిక ప్రపంచం అనేది లేకుండా పోయినప్పుడు, మనం ఆ ప్రపంచంలో భాగంగాలేనప్పుడు మనం ఆ వాస్తవ స్వేచ్ఛని పొందుతామన్న మాట! ఏమిటి, ఈ స్వేచ్ఛా స్వరూపం? వాస్తవం ఏమంటే, భౌతిక వస్తువులూ, వాటి సూత్రాలూ, మన స్వేచ్ఛా కార్యాచరణకి ఆటంకాలు— అవి మన కార్యాచరణని నిలిపివేస్తాయి. వాటిని ఎలా అవగాహన చేసు కోవాలో, వాటిని ఎలా ఉపయోగించుకోవాలో తెలిసినప్పుడు, ఆటంకాలు తొలగి పోతాయి. స్వేచ్ఛ అంటే ఇదే. ప్రజలు సాధించ గలిగేదీ, సాధించేదీ స్వేచ్ఛ. ప్రతి మనిషీ తనకు తాను సాధించుకునేది, సాధించుకోగలిగేది స్వేచ్ఛ కాదు. స్వేచ్ఛ సమాజంలోని వ్యక్తుల కృషివల్ల సాధింపబడే సామాజిక ఉత్పత్తి. ఆవశ్యకతని గుర్తించటం నుంచి స్వేచ్ఛని సాధించగలం కానీ ఆవశ్యకతా నియతిలేని ఊహాజగత్తు నుంచి సాధించలేము.

సుదర్శనం స్వేచ్ఛని బూర్జువా భావజాలకోణం నుంచి చూస్తున్నాడు. ఆవశ్యకత నుంచి స్వేచ్ఛని విడదీసి సృజన అలాంటి స్వేచ్ఛ ఫలితం అని చెపుతున్నాడు. ఏయుగంలో అయినా సృజన ఉత్పత్తి, ఉత్పత్తినైపుణ్యాన్ని సృజన అంటారు. ఉత్పత్తి లేకపోతే స్వేచ్ఛా వుండదు. సృజనా వుండదు. సుదర్శనం భావిస్తున్నట్టు మార్క్స్ ఎక్కడా సృజన 'మానవ సహజ ధర్మం' అనీ, స్వేచ్ఛకి లక్షణం అనీ చెప్పలేదు. ఉత్పత్తిలో స్వేచ్ఛ లేకుండా భౌతిక వస్తువుల్ని సృజనాత్మకంగా ఉత్పత్తిచేసే స్వేచ్ఛ లేకుండా, మానవ బహుముఖ వికాసానికీ, సాహిత్యం వంటి భౌతికేతర ఉత్పత్తులకీ స్వేచ్ఛ వుండదు. మార్క్స్ భావించిన కమ్యూనిస్టు స్వేచ్ఛా సమాజంలో వ్యక్తి ఎవడూ ఏదో ఒక పనికి కట్టుబానిసగా వుండడు. మానసిక, శారీరక శ్రమ విభజన రద్దు కాకుండా స్వేచ్ఛ ఏమిటి? కమ్యూనిస్టు సమాజంలో ఏ పనీచేయని, నేర్చుకోని కేవల రచయితలు వుండరు. అనేక ఇతర పనులు చేస్తూ రచన కూడా చేసే వాళ్ళు వుంటారు. భౌతిక ఆవశ్యకతని అధిగమించటం స్వేచ్ఛ అని మార్క్స్ చిన్నప్పుడు చెప్పాడు. (Economics Philosophical Manuscripts లోనే ఈ భావం కనిపిస్తుంది) తర్వాత ఎక్కడా ఆవశ్యకతని అధిగమించటం స్వేచ్ఛ అని చెప్పలేదు. పైగా కమ్యూనిస్టు సమాజంలో శ్రమ ఆవశ్యకతని అధిగమించదనీ, శ్రమ "కమ్యూనిస్టు సమాజం వున్న దశలో శ్రమ విభజనవల్ల సంభవించిన వ్యక్తుల లొంగుబాటుతనం పోతుంది. దాన్తో మానసిక– శారీరక శ్రమల మధ్య వైరుధ్యం నాశనం అయిపోతుంది. అంత వరకు కేవల జీవనోపాధి మార్గంగా వున్న శ్రమ జీవితం ముఖ్య ఆవశ్యకతగా మారిపోతుంద"[23]నీ చెప్పాడు. ఎంగెల్స్ ఆవశ్యకతని గుర్తించటమే స్వేచ్ఛ అన్నాడు. "ఆవశ్యకతాబంధం ఆధారంగానే స్వేచ్ఛాలోకం రేకువిప్పగలదు" అని మార్క్స్ని వుటంకించి "భౌతిక ఆవశ్యకత నుంచి సృజనను సూత్రీకరించటం నియమించటం సాధ్యం కాదనే ఆయన భావం" అని వ్యాఖ్యానించటంలో సుదర్శనం అభిప్రాయం ఏమిటి? మార్క్స్ రాసిందానికి భిన్నంగా మార్క్స్ భావం ఎలావుంటుంది?

కమ్యూనిస్టు స్వేచ్ఛాసమాజం సమిష్టి మానవతాసమాజం; సామూహిక మానవతాసమాజం; అది భౌతిక సమాజమేకానీ సుదర్శనం మహావికార ఫలితమైన తాత్విక సమాజంకాదు. 'సృజన'ను కవిత్వానికో, కళకో, రచనాశక్తికో పరిమితంచేసి ఆలోచించటం మూఢవిశ్వాసం. పశువులకి భిన్నంగా మానవులకి సృజనాత్మక శక్తివుంది. ప్రకృతినీ పరిసరాల్నీ మార్చటంలో, చైతన్యవంతమైన కార్యాచరణని సృజన అంటారు. సమాజంలో ఉత్పత్తి స్వేచ్ఛ ఏమేరకి ఉంటుందో సృజనాత్మకశక్తి ఆమేరకే ఉంటుంది. భౌతిక ఉత్పత్తుల్లో సాహజిక మానవులు సాధించిన సృజనాత్మక

శక్తే సాహిత్య కళారంగాల్లోని సృజనాత్మక శక్తికిమూలం - ఉత్పత్తిలో బాగా వెనకబడిఉన్న సమాజాల్లో భాషా, చైతన్యం కళారూపాలూ వెనకబడే ఉంటాయి. సృజనాత్మకశక్తి భౌతికమూలమేకానీ, ఆవశ్యకతా నియతుల్ని అధిగమించే, సూత్రీకరణలకీ విశ్లేషణకీ అందని విషయంకాదు. సృజన కేవలం వ్యక్తినిష్ఠంకాదు. వ్యక్తుల సంబంధంనుంచి వికసించేది.

సృజనను చారిత్రికంగా ఇతర అంశాలతో కలిపి గతితార్కికంగా వివేచన చెయ్యాలి. మనిషి చైతన్యానికి ఆలోచనకి ఆవేశానికి మూలమైన శారీరక అంశాల్ని పరిగణనలోకి తీసుకోకుండా సృజనని గురించి చర్చించటం అశాస్త్రీయం. సుదర్శనం వస్తువుల్నీ విషయాల్నీ చారిత్రికంగా పరిశీలించటానికి, విజ్ఞానశాస్త్ర పరిశోధనా దృష్టితో పరిశీలించటానికీ వ్యతిరేకి. మార్క్సు సూత్రీకరణలకీ, అభిప్రాయాలకీ విజ్ఞానశాస్త్రం చాలా ముఖ్యమైన ఆధారం. అయితే విజ్ఞానశాస్త్రాలుకూడా తటస్థంగా ఉండవని గుర్తించాలి. మనిషి మెదడుని గురించిన విజ్ఞానశాస్త్ర పరిశోధనలు సృజన చుట్టూ వేలసంవత్సరాలనుంచి కల్పించుకున్న భ్రమల్ని పటాపంచలు చేసాయి. రచయిత సృజనని సామాజిక - భౌతిక వాస్తవికత పరంగా అవగాహన చేసుకునే క్రమంలో ఉపచేతన (Sub-Consious) పాత్రని విశ్లేషించాలి. మనిషి మెదడుకి స్మృతి (Memory) జ్ఞాపకశక్తి (Rememberance) ఉంటాయి. మనిషిస్మృతి చైతన్యాన్ని భవిష్యత్తునుంచి భూతానికీ, వర్తమానంనుంచి భూతానికీ భూత వర్తమానాల నుంచి భష్యవిత్తుకి తిరిగి తిరిగి ప్రయాణం చేయిస్తుంది. స్మృతి యంత్రాంగాన్ని అధ్యయనం చేయటంవల్ల, సృజన భౌతిక పరిమితుల్లోనిదే అనీ, దానికీ ఆవశ్యకతా నియతులు ఉంటాయనీ రుజువు చేయటం జరిగింది. చైతన్య సిద్ధాంతంతో సంబంధం లేకుండా సుప్తచైతన్యాన్ని (Unconscious) గురించిన పరిశీలన చేయకూడదు. రెండింటినీ కలిపే పరిశీలించాలి. సృజనక్రియం చైతన్య సుప్తచైతన్యాల పరస్పరచర్య. రచయితలందరూ సృజన క్రియంలో సుప్తచైతన్య సహకారాన్ని పొందుతారు. అంటే సృజనలో స్మృతి, జ్ఞాపకశక్తి గుర్తించదగిన పాత్రను నిర్వహిస్తాయి. సృజనక్రియం విభిన్న కళారూపాల్ని బట్టికూడా మారుతూ ఉంటుంది. దాదాపు ఒకేపట్టులో రాసేగీతంలో సుప్తచైతన్య, ఉపచైతన్యపాత్ర ఎక్కువ ఉండవచ్చు. నవల నెలలతరబడీ, సంవత్సరాలతరబడీరాసే అవకాశంఉన్న ప్రక్రియ. మధ్యలో రచయితకీ నవలలోని పాత్రలకీ సంపర్కం ఏర్పడుతుంది. సృజన విషయి విషయాలకీ, విషయిలో విషయమైన సైకీ (Psyche) కీ, విషయిలో విషయమైన (Object) మెదడుకీ గతితార్కిక భౌతిక క్రమఫలితం.

రచయితలు తమ సృజన క్రమాన్ని గురించిన భ్రమల్ని వదులుకొని, సంప్రదాయికంగా వస్తున్న తప్పుడు అభిప్రాయాల నుంచి బయటపడి కాస్త నిదానంగా ఆలోచిస్తే, తమ రచనలో సుప్త చైతన్య సహకారాన్ని పొందుతున్నట్టు గ్రహించటం పెద్ద కష్టమైన విషయం ఏమీ కాదు. కేవలం తమ చుట్టూవున్న సామాజిక వాస్తవికతనే కాక, రచయితలుతమ స్మృతుల్నీ జ్ఞాపకాల్నీ తాము చదివిన గ్రంథాల్లోని విషయాల్నీ కూడా రచనల్లో ప్రతిబింబిస్తారు. ఆ స్మృతులకీ ఆ గ్రంథాల్లోని విషయాలకీ కూడా భౌతిక వాస్తవ మూలాలు వుంటాయి. ఈ సందర్భంలో వ్యక్తిని గురించిన అస్తిత్వ వాద దృక్పథాన్నీ, చైతన్య సుప్తచైతన్యాల్ని గురించిన ఫ్రాయిడ్ సిద్ధాంతాల్నీ వదిలించుకోవాలి. గతితార్కిక భౌతికవాదం అస్తిత్వవాదాన్ని కానీ, ఫ్రాయిడ్ సుప్త చైతన్య సిద్ధాంతాన్ని కానీ అంగీకరించదు. మానవ సారాంశం సుప్త చైతన్యంకాదు. సృజన కేవల సుప్త చైతన్యానికి సంబంధించింది కాదు. వర్తమాన వాస్తవికత నుంచే సృజన క్రమం వికసిస్తుంది. ఆ క్రమంలో వాస్తవ జీవితం నుంచీ, గ్రంథ పరిచయం నుంచీ, స్మృతుల రూపంలో జ్ఞాపకాలరూపంలో వున్న సుప్త చైతన్యం సహకారి అవుతుంది. సృజనకి చైతన్యం ప్రధానం కానీ సుప్త చైతన్యం కాదు.

## సామాజిక స్పృహ - సామాజిక చైతన్యం

"సామాజిక స్పృహ" అనే భావన మార్క్స్ భావనకాదు. అది ఫ్రాయిడ్ భావన. దీన్ని నిర్విచక్షణగా అభ్యుదయ కవులు కూడా వాడుతూ వుండటం అర్థ రహితం. వ్యక్తి ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క విషయాన్ని గురించిన స్పృహలో వుంటాడు. మరొక సందర్భంలో ఆ స్పృహలో వుండకపోవచ్చును, మార్క్సిస్టులు ఈ రకమైన సామాజిక స్పృహ సిద్ధాంతాన్ని అంగీకరించరు. సామాజిక చైతన్యం వేరు, సామాజిక స్పృహ వేరు. మనిషి చైతన్యం, సుప్త చైతన్యం అంతా సామాజికమే. ఈ చైతన్యం పదార్థ మూలకం. ఫ్రాయిడ్ చెప్పిన సామాజిక స్పృహ నిరంతరమైందీకాదు, పదార్థ మూలకమూకాదు. మెదడు క్రమం, మనస్సు క్రమం (Mind Process and Brain Process) రెండూ విడివిడిగా వుంటాయనీ, సామాజిక స్పృహ మనస్సు క్రమం అనీ ఫ్రాయిడ్ అభిప్రాయం. వుండేది మెదడు క్రమమే; దాని వ్యాపారమే మనస్సు క్రమం అని గతితార్కిక భౌతికవాదం చెపుతుంది. బాహ్య భౌతిక ప్రపంచంతో నిమిత్తంలేకుండా మనస్సులో చైతన్యం సుప్త చైతన్య విభజనచేయటం, చైతన్యం స్వతంత్ర ప్రతిపత్తి గల భూమికగా భ్రమపడటమే. వ్యక్తి చైతన్య - సుప్త చైతన్య మూలం నుంచి

వివరణకి పూనుకునే అంతర్ముఖ పద్ధతి (Method of Introspection) ఫలితం_ సామాజిక స్పృహవాదం. ఇది మనస్తత్వరూపంలోని భావవాదం. సామాజిక భౌతిక వాస్తవికతపరంగా, పదార్థపరంగా చైతన్యాన్నీ సుప్త చైతన్యాన్నీ పరిశీలి చే గతితార్కిక భౌతికవాద ఫలితం సామాజిక చైతన్యం. మానవ సారాంశం చైతన్యం కానీ సుప్త చైతన్యం కాదు. మనస్సులో అణచబడి వుండేవి కేవలం కామ సంబంధ విషయాలే కాదు, అన్నిరకాల దోపిడీలు, దోపిడీచేయబడే వాళ్ళ సుప్త చైతన్యంలో వుంటాయి. అప్రయత్నంగా యంత్రాల్ని కార్మికులు తగలబెట్టటం, పెట్టుబడి దారుల్నీ, భూస్వాముల్నీ చంపటం, తన్నటం వంటివి సుప్త చైతన్యక్రియలే. కార్మికులు సంఘటితం అయినప్పుడు సిద్ధాంత సాయుధులయినప్పుడు సుప్త చైతన్యంలో అణిగివున్న పగ, భయాందోళనలు సమిష్టి ఆచరణకి మార్గదర్శకమైన చైతన్యరూపాన్ని పొందుతాయి. చైతన్య, సుప్త చైతన్యాలు అవిభాజ్యాలు. మనస్తత్వశాస్త్రంలో మెదడు నుంచి విడదీసి చైతన్య, సుప్త చైతన్యాల్ని పరిశీలించే థోరణీ, పేరాసైకాలజీ (Para - Psychology) పేరుతో సైకీ (Psyche) కి మాత్రమే పరిమితమై చేసే టెలిపతి (Telepathy) బుద్ధికొలత (Mind dimension) సిద్ధాంతం, అనుభూతులను గురించిWundt చేసిన త్రి ప్రమాణ సిద్ధాంతం (tri - dimensional theory) వంటి పరిశోధనలూ, - చైతన్య సుప్త చైతన్యాల్ని మెదడు వ్యాపారాలుగా పరిగణించి చేసే పరిశోధనలకీ మధ్య సంఘర్షణ భావవాద, భౌతికవాద - గతితార్కిక భౌతికవాదాల మధ్య జరుగుతున్న పోరాట ప్రతిబింబమే. సామాజిక పరిభాషలో చెప్పాలంటే వర్గపోరాట ప్రతిబింబమే. స్వేచ్ఛకానీ, సృజనకానీ భౌతిక ఆవశ్యకతని అధిగ మించలేవు. అంటే భౌతిక ఆవశ్యకత పరిమితులు స్వేచ్ఛకీ, సృజనకీలేకుండా వుండటం జరగదు. భౌతిక పునాదిలేని సృజనాత్మకతనీ, పదార్థ అతీతమైన సృజనాత్మకతని, ఊహించటం కూడా అసాధ్యం.

## సుదర్శనం తలరాత

సుదర్శం మార్క్స్ వాక్యాల్ని ఉదహరిస్తూనే ఆవశ్యకత, సేచ్ఛ, సృజనలకి మార్క్స్ ఉద్దేశించిన అర్థాలకి భిన్నమైన నిర్ధాణలు చేశాడు. చివరికి తనతలరాత తనకే సంతృప్తికరంగాలేక తెలుగుదేశంలో మార్క్సిస్టులమీద విరుచుకపడ్డాడు. "మార్క్సిస్టు ముసుగు" వేసుకున్నవాళ్ళు సాహిత్యాన్ని పెట్టుబడి చేసుకొని రాజకీయంగా, ధనరూపేణా లాభంపొందాలని ఆశిస్తున్నారట. ఇవి "శ్రీసుదర్శనం" సొంతవాక్యాలు కాబట్టి ఇలాఉన్నాయి. రాజకీయాలకి పెట్టుబడి-ఏమిటో, సాహిత్యం

పెట్టుబడి ఎలాఅవుతుందో సుదర్శనానికి తెలీదు. పుస్తకాలు వేసిడబ్బు సంపాదించటం సంగతి అలావుంచి 'రాజకీయలాభం' సంగతే చిత్రంగావుంది. మార్క్స్ రచనల్ని, పోనీ, సుదర్శనంరాసిన మార్క్సిదృష్టిలో సాహిత్యంవంటి వ్యాసాలయినా ప్రచు రించకపోతే జనంలోకి ఎలావెళతాయి? ప్రచారంలోకి తేకపోతే మార్క్సిభావాలు ప్రజలకి ఎలాతెలుస్తాయి? పైగామనంఇంకా బూర్జువాహద్దుల్లోనే ఉన్నామా? బూర్జువా వ్యవస్థ స్వచ్ఛంగా వుంటుందని సుదర్శనానికి మార్క్స్ చెప్పిపోయాడా? బూర్జువావర్గం ఉన్నదంటే కార్మికవర్గం ఉన్నదనిఅర్థం కార్మికవర్గం ఉన్నప్పుడు కార్మికవర్గ సాహిత్యం ఉండదూ?

సుదర్శనం వేసుకున్న మార్క్సిముసుగును తొలగించి చూడాలి. మొఖానికి కట్టుకున్న మార్క్స్ అట్టబొమ్మని తొలగించిచూడాలి.

అస్తిత్వవాదం ముసుగు తత్వశాస్త్రం. అస్తిత్వవాదులు అందరినీ ముసుగు వేసుకున్నవాళ్ళనుగాతప్ప చూడలేరు. ఈవ్యాసంలో సుదర్శనం మార్క్సివాక్యాల్ని ఉల్లేఖిస్తూ అస్తిత్వవాదం చెప్పాడు. మార్క్సివాక్యాల్ని ఉటంకించటం, వాటిని అస్తిత్వవాదపరంగా వక్రివ్యాఖ్యలు చేయటం సుదర్శనం చేసినపని. అస్తిత్వవాదులు చారిత్రికదృక్పథానికి వ్యతిరేకులు. అందుకే సుదర్శనం చారిత్రిక భౌతికవాదాన్ని వదిలేసి, విప్లవ ఉద్యమంనుంచి రాజకీయ కార్యకర్తనీ రచయితనీ వేరుచేసి, రచ యితకి వాదపరమైన విప్లవార్హతని సాధించాడు. అస్తిత్వవాదులు సాహిత్యం అన్నిటి కంటే "మహత్తరం" అని భావిస్తారు. తమ సిద్ధాంతాన్ని కళాకారుని ప్రతిభని (intuition of artists) ఆశ్రయించి మాత్రమే చెప్పగలరు కాబట్టి అస్తిత్వ వాదులు సామాజిక కార్యాన్ని సాహిత్యకార్యంగా గందరగోళం చేస్తారు. సుదర్శనం ఆపనేచేసి, సోషలిస్టు ఉద్యమానికి బద్ధంకావటం తొత్తునిబద్ధతగా చిత్రించి, సాహి త్యానికి నిబద్ధంకావటమే నిబద్ధతఅనీ, సాహిత్యం రచయితకి సర్వస్వం కావటమే నిబద్ధతఅనీ ఉద్ఘాటించాడు. సాహిత్యాన్నీ రచయితనీ సామాజికవిప్లవ కార్యరంగం నుంచి దూరంచేశాడు. విషయి ఇష్టాయిష్టాల్తో నిమిత్తంలేకుండా, విషయికి స్వతం త్రంగా విషయంఉంటుందనే గతితార్కిక సూత్రాన్ని పేర్కొంటూనే, విషయి-విష యాల సంబంధంనుంచి, వ్యక్తికీ రచయితకీ స్వతంత్ర ప్రతిపత్తిని చెప్పటం "సారాంశంకంటె ముందే అస్తిత్వం సంభవిస్తుంది"[24]అనే అస్తిత్వవాద వ్యక్తిని గురించి చెప్పటానికి మార్క్సిజాన్ని ఉపయోగించుకోవటంకాదా? విలక్షణంగా, సృజనాత్మ కంగా వ్యక్తి భాషని ప్రయోగిస్తాడని చెప్పడానికి భాషద్వారా విప్లవం సాధించవచ్చు

సనే సాత్రే భ్రమ మూలంకాదా? సామాజిక చైతన్యాన్ని గురించి ప్రస్తావిస్తూనే చైతన్య పునాది అయిన పదార్థాన్ని నిర్లక్ష్యంచేసి వ్యక్తి చైతన్యాన్ని విశిష్టంగా పైకి ఎత్తటం, మార్క్సిజంలో బాహ్య వాస్తవికతకి వున్న ప్రాధాన్యాన్ని నిరాకరించి అస్తిత్వవాద విషయిని దూర్చటం కాదా? విషయికీ విషయానికీ గతితార్కిక భౌతిక వాద పరస్పరతని చెప్పిన మార్క్సు పరిశీలనని ప్రతిపాదించి, గతితర్కాన్నీ భౌతికతనీ వదిలిపెట్టి, విషయికి కేంద్రస్థానాన్నీ, భావస్వాతంత్ర్యాన్నీ మార్క్సు చెపుతున్నాడని వక్రీకరించటానికి "నన్ను నేను రూపొందించుకోవటంలో మనిషిని రూపొందిస్తాను"[25] "మనిషి అంటే కేవలం మనిషే"[26] అనే అస్తిత్వవాద శుష్క సూత్రీకరణలు కారణం కాదా? ప్రతి వ్యక్తికీ సమాజంలో విషయిగా కేంద్రస్థానాన్నీ, భావస్వాతంత్ర్యాన్నీ విషయ ప్రమేయంలేకుండా, చారిత్రికదశతో సంబంధంలేకుండా అంగీకరించేది మార్క్సు కాదు, సాత్రే. దీన్ని సాత్రే "అన్యోన్య విషయితత్త్వం (inter - Subjectivity) అంటాడు. సాత్రేవాదాన్ని మార్క్సుకి ఆపాదించటం దేనికి? పైగా ఇది మార్క్సిస్టు మానవతావాదమట. మార్క్సు సమాజపరిధిలో ఇతర వ్యక్తుల్తో కలిసి సామూహక సమాజంలో స్వేచ్ఛనీ భావస్వాతంత్ర్యాన్నీ ప్రతి పాదించాడనీ సాత్రే వక్రీకరించకుండా చెప్పాడు. ఇతరుల భావస్వాతంత్ర్యాన్ని నేను సంకల్పించలేనప్పటికీ నా స్వాతంత్ర్యం ఇతరుల మీదా, ఇతరుల స్వాతంత్ర్యం నామీదా ఖచ్చితంగా ఆధారపడివుంటుందన్నాడు. సుదర్శనం సామూహిక జీవిని (Collective being) నిరాకరిస్తూ సాత్రే అభిప్రాయాన్ని మార్క్సు అభిప్రాయంగా చిత్రించాడు. వస్తుశిల్పాల్ని బట్టీ, రచయిత వర్గదృష్టిని బట్టీ ఆ రచన ప్రజా పోరాటానికి దోహదం చేస్తుందా లేదా అని కాక, ఉత్పత్తిగా రచనని బట్టి చూడాలని మార్క్సు అభిప్రాయంగా సుదర్శనం చెప్పాడు. "ఉత్పత్తి అస్తిత్వానికి పూర్వ దశగా వుంటుంది"[27] అనే సాత్రే సూత్రీకరణని పట్టుకొని ఒక రచన బూర్జువా రచనా, విప్లవ రచనా అనేది నిర్ణయించాలని చెపుతూ, మార్క్సు ఈ విషయం చెప్పినట్టు చిత్రించటానికి పూనుకోవటం వంచన కాదా? మార్క్సు స్వేచ్ఛకీ, సృజనకీ ఆవశ్యక నియతుల్నీ సామాజిక చారిత్రిక పరిమితుల్నీ చెపితే సుదర్శనం "మనిషి అంటే స్వేచ్ఛ, మనిషి అంటే స్వాతంత్ర్యం"[28] అనే అస్తిత్వవాద స్వేచ్ఛని మార్క్సుకి అంటగట్టాడు. మీరు చెప్తున్న స్వేచ్ఛకి లక్ష్యం ఏమిటి? అని ప్రశ్నిస్తే సాత్రే మౌనంవహిస్తాడే, ఎందుకని? సాగదీస్తే ఆధ్యాత్మికవాదంలో పడక తప్పదు కాబట్టి సుదర్శనం మార్క్సు చెప్పిన ఆవశ్యకత నుంచి స్వేచ్ఛని విడదీసి, సృజనను స్వేచ్ఛ ఫలితంగా చెప్పటం, చివరికి సృజనను వివరణకి అతీతమైన బ్రహ్మపదార్థం చేయటమే కదా? సుదర్శనం

మార్క్స్‌లోకి సాత్రెని 'పరకాయ ప్రవేశం' చేయించి, ఆకారంలో మార్క్సిజం, సారాంశంలో అస్తిత్వవాద 'దర్శనం'గా వుండే సంకరజాతి కుక్కపిల్లల్ని పుట్టించాడు. అయితే అవి మొరగటమే కానీ, కరవలేవు.

ఇదీ సుదర్శనం మార్క్సిస్టు ముసుగు. ఈ ముసుగులో మార్క్స్‌ని కూడా మార్క్సిస్టు ముసుగు వేసుకున్నాడనగలడు. ఇదంతా కమ్యూనిస్టు వ్యతిరేక విషం. తాత్త్విక అరాచకత్వం. గంభీరంగా కనిపించే డొల్లతనం; కొత్త పరిమళాన్ని వెదజల్లుతున్నట్టు కనిపించే కుళ్ళు కంపు.

## NOTES

1. Engels, Marx-Engels selected correspondence, p 499 Foreign Languages Publish House - Moscow 1953
2. Marx-Engels works - Easton & Guddat - p 355 - 357
3. Marx-Engels collected works – Vol. 1 – p 195 Progress publishers Moscow
4. Engels - revolution & counter revolution in Germany Marx-Engels collected works Vol. II – p. 14 Progress publishers, Moscow 1979.
5. Marx-Grundrisse, Tr. by M. Nicolaus 1973 – p 265
6. Marx - Theses on Feurbah, Marx & Engels collected works – V 5 – p 6-8 – Progress publishers, Moscow
7. Marx-Engels collected works – Vol. 5 – p. 43-44 Progress publishers, Moscow 1976
8. Marx-Engels collected works – Vol. 3 – p. 320 Progressive publishers, Moscow 1975
9. Quoted in Marx on literature by E. Troschenko printed in 'Lenin on Art and literature – p. 109-110 Oriental publishing house, Benares 1943
10. Marx-Grundrisse, Penguin edition - p 93
11. Marx-Engels, Manifesto of the communist party p 69 – Foreign languages press, peking
12. Marx - Theories of Surplus Value, part I, chapter IV p 288, Progress publishers, moscow 1975
13, 14, 15 Ibid – p 173, 293, 401
16. Marx-Engels collected works - Vol. 4 - p 130-131 Progress publishers, moscow.
17. Marx-Engels sected works - I, p 31, moscow 1970.
18. Ibid – p 518
19. Marx - Theories of Surplus Value - part I Addenda p 403-404, Progress publishers, moscow 1975
20. Marx-Economic and philosophical man scripts of 1844 - p 75 - Progress publishers 1959

చౌ లి-పో

ఇంగ్లీషు నుంచి తెలుగు

నళిని

నవల - సీరియల్

# ఉప్పెన

రెండవ భాగం

పాడుకుపోయిన పాతపద్ధతుల్ని, పేరుకుపోయిన తప్పుడుభావాల్ని దిద్దేందుకు ఓ సమావేశం జరిపి, దళసభ్యులు చుట్టుపక్కల గ్రామాలు కూడా చూసిరావడానికి బయల్దేరేరు. వాళ్ళంతా ఇరవైయేళ్ళలోపువాళ్ళే. ఆ పదిహేనుమందీ, తిండి అయినా తినకుండా, చలిగాలి మంచు లెక్కచేయకుండా తమ సంచులు భుజాల మీద వేసుకుని వెళ్ళిపోయేరు.

సియావో మాత్రం వాన్‌తోపాటు యువాన్ మావోలోనే వుండిపోయేడు. కువో చువాన్ - హైని చూడాలన్న ఆతృతతో సియావో అతనింటికి రెండుసార్లు వెళ్ళేడు గానీ రెండుసార్లూ తలుపు తాళంవేసే వుంది. కువో రాగానే తనని రైతుసంఘం ఆఫీసులో కలవవలసిందిగా పొరుగువాళ్ళతో చెప్పి వచ్చేసేడు. వచ్చేసరికి ఆఫీసు ముందు అతని కోసం జనం కాచుక్కూర్చున్నారు. చాంగ్ఫూ - యింగ్ ఆఫీసు తలుపుల మీద అంటించిన కాగితాలు రెండు చింపిపారేసేరు చాంగ్ చింగ్-షీ, ఓల్డ్‌సన్. వాటిమీద ఓల్డ్‌సన్ ఉమ్మేసేడు. అతను చాంగ్‌ఫూయింగ్ తనని తన్నినదానికి కసితీర్చుకున్నాడు.

ఏడాది క్రితంలావుంది ఊరు. జనం మళ్ళీ ఉత్సాహం పుంజుకున్నారు. పనులేవేవో చేసెయ్యాలని ఉత్సాహంగా వున్న నూటఇరవైమంది గ్రామస్థులతో సియావో మాట్లాడేడు. భూసంస్కరణచట్టాన్ని వాళ్ళకు వివరించేడు. ఆ వారమంతా ఊరి పరిస్థితులు తెల్సుకోడానికీ, ఇతర ప్రాంతాల పరిస్థితులు వివరించడానికే సరిపోయింది సియావోకి.

"కబుర్లేనా, మనమేదన్నా చేసేదున్నాదా?" అని అడిగేడు ఆరోనంబరు హాన్‌ని పట్టించిన 'చు'.

"అవును, చేసెయ్యాల. ముందు కోపరేటివ్ స్టోరు పని సూడాల" అని అరిచేరందరూ


21. Milton-Samson Agonistes - Edited by Maynard mak, p 315, lines 1053-1055
22. Marx - A contribution to the critique of political Economy, p 215-217, Progress publishers 1970
23. Marx-critique of the Gotha programme - p 18 Progress publishers, moscow 1954
24. Jean paul Sartre, Existentialism and humanism Translation - Philip mairet, p 26, Eyre Mekhuen Ltd, London 1977
25, 26, 27, 28. Ibid p. 30, 28, 27, 34.

"చాంగ్‌ఫూ - యింగ్‌ని ఒట్టుకోండి" అన్నాడు ఓల్డ్‌సన్

"ఇంకా అతన్ని గురించే ఆలోచిస్తున్నావేటి తాతా ?" అని ఎద్దేవ చేసేడు చాంగ్ చింగ్ - షీ.

కాంగ్ ముందునుంచుని అందర్నీ సర్దుతూ సియావో

"ఆగండి కొంచెం. మనం తప్పకుండా కార్యశూరులంకావాలి కాని ఏ పనీ తొందరపడి చేయగూడదు. ముందు అనుపానులు చూసుకోవాలి. బుగతల్ని పూర్తిగా మట్టుపెట్టాలంటే మనం నిబ్బరంగా నిలబడాలంటే పేద రైతుకూలీలం కలిసి మధ్య తరగతి రైతుల్ని కలుపుకురావాలి. మనం "పేద రైతు, కంబారుల లీగ్ ఒకటి ఏర్పరిస్తే ఎలావుంటుంది ?" అని అడిగేడు.

అందరూ సమ్మతి సూచకంగా చప్పట్లు కొట్టేరు.

ఇంతలో "చైర్మన్ కువో ఒచ్చీసినాడు !" అని ఎవరో అరిచేరు. అందరు వెనక్కి తిరిగి చూసేరు. కువో తలుపుదగ్గర నిల్చున్నాడు. చిరిగిపోయిన తోలు టోపీ పెట్టుకున్నాడు. చలికి చిక్కిపోయిన అతని మొఖం పాలిపోయింది. గడప మీద నిల్చోవడంవలన అందరిపై నుంచి కనిపిస్తున్నాడు. అతను చిరునవ్వుతో సియావోని పలకరించేడు. సియావో అతన్నిలోనికి పిలిచేడు.

ఓల్డ్‌సన్ ముందుకొచ్చి జనాన్ని వెనక్కితోస్తూ "నెగండి నెగండి, సైర్మన్ కువోకి దారియ్యండి" అని అరిచేడు.

కువో ఆ సందులోంచి ముందుకొచ్చేడు. అతను నీలంకోటు తొడుక్కున్నాడు. కొండల్లో చెట్లకొమ్మలు పట్టుకుని చాలా చోట్ల అది చిరిగిపోయింది. చిరుగులున్న చోటల్లా కోటులోంచి దూది బయటపడ్డంతో దూరానికి అతను తెల్ల పూలచెట్టులా వున్నాడు.

"ఎంతచక్కని చొక్కా వేసుకున్నావయ్యా !" అన్నాడు సియావో నవ్వుతూ.

"ఊళ్ళో దీనికి తెల్లపూల కోటని పేరెట్టీసినారు" అన్నాడు కువో

"ఇయాల అది నాకిస్తే నీలంగుడ్డతో అతుకులేస్తా" నంది పాయిభార్య.

"ఒద్దులే, రేతిరి రేతిరంతా కూసున్నా దీన్ని కుట్టనేవు. అన్ని సిరుగు లున్నాయి" అన్నాడు కువో.

"నానుకూడా కుడతా. ఇద్దరుకలిసి రేతిరికి కుట్టెయ్యగలం" అంది పాయివెనక నుంచున్న ఓ రెండుజడలపిల్ల.

కువోఆమెని చూసేడు. 'తు' కుటుంబం వుంచుకున్నపిల్ల* ఆమె. ఇంకాపెళ్ళి కాలేదుగాని, త్వరలో అవుతుంది. ఆమేపేరు లీకీ-లాన్. కువో మాట్లాడలేదు.

"చైర్మన్‌కువో! కాంగ్‌మీద కూనో ఎచ్చగుంటాది"అని అందరూ అన్నారు.

కువో సియావోపక్కనే కాంగ్‌మీద కూర్చున్నాడు. ఇద్దరూ కలిసి మాట్లాడుకో సాగేరు.

పేదరైతులూ, కంబార్లుకలిపి ఒకలీగ్ ఏర్పరిచేరు. అందులో సభ్యులందరు తమ శాయశక్తులా భూస్వామ్యాన్ని కూలదోయడానికి పనిచేస్తామని ప్రమాణం చేసేరు. ఆ లీగ్‌కి కువోని చైర్మన్‌గా ఎన్నుకున్నారు.

మీటింగు అర్ధరాత్రివరకు సాగింది. అందరూ ఇళ్ళకు వెళ్ళిపోయేరు. కువో బట్టలిచ్చి దాన్ని పాయి యింటికి పంపేడు సియావో. బుడ్డిదీపం వెలుగులో కోడి కూసే వరకు ఆ చిరిగిన బట్టలకు అతుకులు వేసేరు పాయి భార్య, లీకీ-లాన్.

వాళ్ళు ఆ బట్టలు కుట్టినంతసేపు సియావో ఇచ్చిన మట్టిరంగు ఆర్మీ దుప్పటి కప్పుకుని పండుకున్నాడు కువో. ఆ రాత్రింతా సియావో, కువో మాట్లాడుతూనే వున్నారు. కువోకి ఊరి విషయాలు బాగా తెలుసు. అతనిది మంచి జ్ఞాపకశక్తి, స్పందించగల హృదయం. నూనె అయిపోవడంవల్ల బల్లమీది దీపం రెపరెపలాడింది. సియావో అందులోకి నూనె ఒంపి, వత్తిపెద్దది చేసేడు. కువోవైపుకు తిరిగి పండుకుని

"ఈ ఊళ్ళో దుష్టగ్రహాలన్నిటినీ వదిలించేసినట్లేనా?" అని అడిగేడు.

"నేదు బాబూ, ఆల పునాదులు యింకా గట్టిగానే వున్నాయి."

"దుష్టత్రియంలోని 'తు', 'తాంగ్' ఏంవయేరు?"

"ఆలు దిగిపోనారు కాని పూరాగా దిగిపోనేదు."

"చాలా ఊళ్ళల్లో కాంవందులు తుపాకులు ఇచ్చేసేరు- ఈ ఊళ్ళో ఎక్కడన్నా తుపాకులు దొరికేయా?"

"ఆరోనంబరు హన్‌కాడ శానావుండాలి- ఆడు ఆటిని శానా ఊర్లల్ల దాసీసినాడు. అన్నిసోట్ల దొరికినాయి గాని యీ ఊర్ల యింకా దొరకనేదు."

"ఈ ఊళ్ళో అతని కుటుంబంలో ఏంవన్నా తుపాకులున్నాయంటావా?"

"నెక్క సూడాల మరి- మునుపు హన్‌కాడ గార్డులుండీవోరు. అప్పుడు లొంగిపోయిన జపానోల్ల మిలటరీ స్టోరులో ముప్పై ఆరు తుపాకులు కొన్నాడు. అడి తమ్ముడు

* child bride (Tr.)

బందిపోటోల్లతో కల్సినపుడు ఆటిలో ఇరవై తుపాకులట్టుకుపోనాడు. వొడుగుమెడ హాన్, లీ చింగ్-షాన్ అడితో కల్సిపోనారు కదా, అప్పుడు మరికొన్ని ఒట్టుకుపోనారు. ఇప్పుడు శానా ఊర్లల్ల తుపాకులా దొరికినాయి- ఇంక ఎన్నో మిగిలుండవు బాబూ!"

"దుష్టతర్రియపు 'తాంగ్' దగ్గర ఏవన్నా తుపాకులున్నాయా?"

"అడు మొలకి బంగారం కట్టుకుని నూతిలో కురుకుతాడు గాని డబ్బు మాత్రం వదులుకోడు- అడా తుపాకులు కొనీదీ, ఉత్త పిరికోడు- బయినెట్ సూపితే వణవణ వనికిపోతాడు."

"మరి 'తు' దగ్గిరో?"

"మంచుకో పెబుత్వంలో ఆడు సాయుధ దళనాయకుడు- మరి తుపాకులుండాల. "చైనా రిపబ్లిక్కులో 'తు' కాడ తుపాకులుండేయం"తారు మా పెద్దోలు. కాని ఇంకా ఏఁవీ దొరకనేదు."

సియావో నవ్వేడు- ఇంత స్పష్టమైన వివరాలంటే అతనికిష్టం- కొంచెం ఆలోచించి నిదానంగా మాట్లాడేడు.

"దాచిన తుపాకులింకా యీ వూళ్ళో వుండే ఉంటాయి. కాఁవందుల దగ్గర తుపాకులున్నంత కాలం వాళ్ళ చేతిలో అధికారం ఉన్నట్టే అవుతుంది. ప్రస్తుతం మనకింకా ఏఁవీ తెలీదు కాబట్టి కొంచెం ఆగాలి. మనం తొందరపడి ఇప్పుడే తుపాకులకోసం వెదికి అవిదొరక్కపోతే ప్రజల ధైర్యం సడలిపోతుంది- అందాకా, మనం తప్పకుండా నెగ్గుతాఁవని నమ్మకంవున్న సమస్యలనే తీసుకోవాలి- కాఁవందుల ఆస్తుల మీద దెబ్బతీసి స్వాధీన పరచుకోవాలి-" తను దళ సభ్యుల సమావేశంలో చెప్పిందే మళ్ళీ చెప్పేడు.

"ఇనుము ఒక్కసారిగా ఉక్కు అయిపోవాలంటే కుదరదు".

"నిజమే"నన్నాడు కువో

"చాంగ్‌ఫూ-యింగ్ ఎలాంటివాడంటావ్?" అనడిగేడు.

"మొట్టమొదాట అతనోకామందు. రైతుసంగంలో కొచ్చేక తన నేస్తాలందర్నీ కలుపుకున్నాడు. ఆలమాటే వినీవోడు. ఆలది ఇట్టా రాజ్జెం అయింది. లీకీ-యంగ్ కూడా నెద్దోడే. కాని ఆడు ఎనకుండి కతనడిపిత్తాడు. అందుకే జనం చాంగ్ ఎదవనుకుంతారు గాని ఆలకి లీ చంగతి తెల్దుబాబూ. చాంగ్‌కి పైనే ఇసంగాని లీకి నిలువెల్లా ఇసమే. చాంగ్ వుంచుకున్న ముండ ఆడిని రోజూ ఆఫీసులో

కలుస్తాది. లీ వుంచుకున్నది ఆడింటోనే వుంతాది. "సెక్రెటరీ లీ మంచోడు. సెడిపోయిన ఆడోల్లజోలికిపోడు" అనుకుంతారంతా."

"లీ ఎవరిమంచుకున్నాడు ?"

"ఆరోనెంబరు హన్‌నేడా, ఆడి ముండని."

"ఇతన్ని నిరుడు చూడలేదే ?"

"ఎవుల్ని - లీకి - యంగ్‌నా ? ఆడు ఈ ఏడాదే ఒచ్చినాడే ?"

"ఎక్కణ్ణించి ?"

"ఎవులికెరిక ? కొంత మందిరి, బందిపోటోల్ల కాన్నించి పారిఒచ్చినాడంతే. మరి కొంతమందిరి ఆడు చాంగ్ చున్ నుంచి ఒచ్చేడంతారు."

ఇది వినగానే సియావో దిగ్గునమోచేతి మీదలేచి "నీకెవరు చెప్పేరు ?" అనడిగేడు.

"తూరుపీదిల వుంతాదికాదా ఆ వాంగ్ భార్య సెప్పింది. లీ ఆమెకాడికి పోతుంతాడు. అతనే సెప్పేడట".

సియావోలేచి బల్లముందు కూచుని వత్తి సరిచేసి ఓ పుస్తకం కలంతీసి కువో చెప్పిన విషయాలు రాసుకున్నాడు. అతనిది మంచి జ్ఞాపకశక్తే అయినా, ముఖ్యమైన విషయాలు రాసుకునేవాడు. సియావో మళ్ళీ కాంగ్ ఎక్కి కువోకి గుర్తుచెయ్యడానికన్నట్టు,

"అయితే యింకా యీ ఊళ్ళో చెడ్డవాళ్ళున్నారంటావా ?" అని అడిగేడు.

సియావో రాస్తూండగా కువో నిద్రపోయేడు- ఈ మాటతో మెలకువవచ్చి-

"ఏటంతరు బాబూ ?" అని అడిగేడు.

"ఈ ఊళ్ళో బందిపోట్లు దాగున్నారంటావా ?"

ఇప్పటి కతనికి బాగాతెలివొచ్చింది. సియావో చెప్పేది వినసాగేడు- జపాన్, కొమింటాంగ్ గూఢచారులు చీకట్లో ఎలా తుపాకులు పేల్చేదీ, తింగిడింజల్లోనూ, నీళ్ళలోనూ ఎలా విషంకలిపేదీ చెప్పేడు సియావో.

"ఈ ఊళ్ళో ఏమన్నా పుకార్లు పుట్టేయా ?" అనడిగేడు సియావో.

"కొమింటాంగ్ సైన్నాలు మల్ల వత్తన్నాయని పుకారున్నాది బాబూ. ముసిలోల్లు మరోటి మొదలెట్టేరు "హన్ ఇంటిపైకప్పు ఎర్రిపూలుపూత్తుండాది, తోటలోసెట్టు తెల్లపూలు పూత్తున్నాది. అందుకే అంతా మళ్ళీ మారిపోతాద ! అని. ఈ పుకారే బాగా అగుప్పుగా సెప్పుకుంతారు".

"దీన్ని ఎవరు ప్రచారంలో పెట్టేరు?"

"ఆరోనెంబర్ హౌస్ ముండట"

"అంటే ఇప్పుడు లీకీ-యంగ్ వుంచుకున్నాదిదేగా?"

"అవును బాబూ"

"ఈ పుకారు చాలా మంది నమ్మేస్తారా?"

"ఓల్డ్‌సన్ కూడా దీనిమీద ఆలోశనసేసినాడు బాబూ"

"అసిసరే ముసలోళ్ళలాగే కుర్రకారు కూడా నమ్ముతున్నారా? అయితే ఈ విషయం గట్టిగానే ఆలోచించాలి. పెద్దలీ స్ట్రెచర్లు మోయడానికి సైన్యంలో చేరినప్పటి నుండి ఈ ఊళ్ళో గూఢచారులను పట్ట పగ్గాలేవని తెలిసింది. అది వీల్లేదు. కాఁవందులను వోటుపొడుస్తూనే గూఢచారులను కూడా తుడిచిపెట్టాలి. కాఁవందులు అగుపడే శత్రువులు. మరి గూఢచారులో-వాళ్ళు బయటపడరు. అందుకే వాళ్ళని పట్టడం కష్టం."

"నిజఁవే బాబూ, బందిపోటుని పట్టుకోవడం సులువేగాని జేబుదొంగని తేలిగ్గా పట్టుకోనేవేఁ। ఎలుగులో బల్లెపోటు తప్పించుకోవచ్చుగాని సీకట్లో బాణందెబ్బ కాసుకోలేం"

"గూఢచారులను పట్టివ్వడానికి మనం జనాన్ని కూడగట్టాలి. వాళ్ళు తమంత తాము నిలబడి వర్గచైతన్యం పెంపొందించుకున్ననాడు ఆ గూఢచారులు ఏఁవీ చేయలేరు. జనం అజేయశక్తి. ఇంతకీ పెద్దలీస్థానంలో ఎవరుండొచ్చనంటావ్?"

కువో కొంచెం ఆలోచించి చాంగ్ చింగ్-సియూంగ్ తమ్ముడు చాఁగ్ చింగ్-షీ వున్నాడుకదా, అతను పనికొత్తాడు బాబూ" అన్నాడు.

"అయితే అతన్ని రేపు తీసుకురా"

తెల్లవారవచ్చింది. కోడికూసింది. నూనె అయిపోయి దీపంవత్తి చిన్న దయింది. సియావో ఈసారి దాన్ని ఆరిపోనిచ్చేడు. నెమ్మదిగా చీకటి విచ్చుకుని మంచుపట్టిన కిటికీలు వెలుగందుకున్నాయి. కిటికీలలో పిచికలుచేరి కలకలరావాలు చేయసాగేయి. సియావో కళ్ళు మూసుకున్నాడోలేదో మళ్ళీ ఏదో గుర్తొచ్చి "నిద్రపోయేవా?" అని అడిగేడు. "లేద"న్నాడు కువో.

"లేవగానే చెయ్యాల్సిన మొదటిపని- చాంగ్‌ఫూ-యింగ్ దగ్గరవున్న అయిదుగురు సైనికుల తుపాకులు స్వాధీనం చేసుకోవాలి. కొందరు యువకులతో సైనికదళం ఏర్పరచు. నాయకుడుగా 'చూ' వుండొచ్చనంటావా?"

"పర్నేదు బాబూ"

మళ్ళీ నిశ్శబ్దం. ఇద్దరూ గురకపెట్టసాగేరు. తెల్లవారగానే వాన్ పాయి యింటికివెళ్ళి కువో బట్టలు తీసుకొచ్చేడు. అప్పటికీ కువో, సియావో లేవలేదు.

మంచు, ఈదురుగాలి కూడా తగ్గేయి. ఆకాశం తేటపడి, సూర్యకిరణాలు ఇళ్ళ గోడలను కిటికీలను తాకుతున్నాయి. కిటికీ పక్కగా కూర్చుని వాన్ కూని రాగాలుతీస్తూ ఓ తుపాకి పాతగుడ్డతో తుడవసాగేడు. పొడవాటి మొఖమున్న ఓ పొట్టిమనిషి బైట తచ్చాడుతుంటే వాన్ పిలిచేడు. ఆ పొడుగు మొఖంనవ్వి,

"సియావో బాబుని సూడాల. నాపేరు లీకీ - యంగ్"

వాన్ అతని చిరిగిన బట్టలు, తోలుటోపీ పరిశీలనగాచూచి "నువ్వు లీకీ - యంగ్‌వా? సియావో నిద్రపోతున్నాడు" అన్నాడు.

లీ వెళ్ళిపోయేడు. వాన్ ఇంకా అలాగే తుపాకి తుడుస్తూ పాడుకోసాగేడు. కొద్దిసేపట్లో ఓల్డుసన్ వచ్చేడు.

"కాంగ్‌మీదికెక్కు, వెచ్చగావుంటుంది" అన్నాడువాన్. ఓల్డ్‌సన్ కాంగ్‌మీద ముడుచుకూర్చుని "లీకీ-యంగ్ ఈడకి ఎందుకొచ్చినాడేటి?" అని అడిగేడు.

"నీమీద చాడీలు చెప్పటానికి"అని వేళాకోళమాడేడువాన్.

ఓల్డ్‌సన్ ఎడంకన్ను చికిలించి "నామీదనే సెపుతాడూ? ఆడంటే నాకు భయం నేదులే. నేనుఆడినాగా చాంగ్ పూయింగ్ ఎంటెంట తిరగనేదే. చాంగ్ రైతుసంఘంలో దూరిపోతే లీ ఆడి సెకటరీ అయిపోనాడు. చాంగ్‌కి చిన్నమీకి తారుపుగుల్ల ఎవులను కున్నావ్, లీగాడే! ఆడునాకు తెలీదనుకున్నాడేటో నాకు అన్నీ తెలుసే. నాను కానాసూసేను. ఏదేటో నాకు తెలీదనుకున్నాదేవో? చాంగ్ ముటా అంతాకలిసి కాషందుల ఎన్ను కాసేరు. థు, తాంగ్‌కూడా రైతుసంగానికి ఒచ్చేవోళ్ళు పేదోలంటే ఎవులకీ నెక్కనేదు. పైగా కొత్తమెత్తనోడైతే మరీ అలుసు. చాంగ్ మొల్లోకత్తెట్టి బూట్లు టకటకలాడిస్తూ మంచుకో పోలీసాపీసరులా గుండేవోడు" అన్నాడు.

"చాంగ్ నిన్నెప్పుడేనా కొట్టేడా?"

"ఆడికన్ని దమ్ములున్నాయేటి?"అని బొంకేడు.

వాన్‌కి అసలుసంగతి తెలుసు అందుకే ఆటపట్టించేడు.

"నిన్ను బూటుకాలితో తన్నేడన్నారే చాలామంది?"అంటూ.

ఓల్డ్‌సన్ నిస్సహాయంగా "అదంతా అబద్ధం. నువ్‌నమ్మకు. నన్నేతంతారేటి? నన్నునిజంగాతంతే ముందస్తుగా నీకుసెప్పుకోనేటి? తన్నించుకుంటే అది అవమానం కాదు; అది ఒప్పేసుకుంటే అదేగౌరవం" అని బుకాయించేడు. ఓల్డ్‌సన్ నోటినుంచి 'అవమానం' 'గౌరవం'లాంటి కొత్తమాటలు విని వాన్ నవ్వాపుకోలేక పెద్దగా నవ్వేసేడు. సియావోకి మెలకువవచ్చింది.

"ఎవరది, ఎందుకు నవ్వుతున్నారు?"

"ఓల్డ్‌సన్ వచ్చేడ"ని జవాబిచ్చేడు వాన్.

"లోపలికిరమ్మను"

లోపలికివెళ్ళి కాంగ్ ఎదురుగావున్న బల్లమీద కూర్చున్నాడు ఓల్డ్‌సన్. సియావో, కువో ఇద్దరూలేచేరు. కువో బట్టలేసుకుని ఏఁవీ తినకుండానే చాంగ్ సైనికులదగ్గర తుపాకులు తీసుకోవడానికి వెళ్ళిపోయేడు. ముఖంకడుక్కుంటూ సియావో ఓల్డుసన్‌ని పరామర్శించేడు "ఎలావున్నావోయ్?" అంటూ.

"పర్నేదు బాబూ. అన్నంనేకపోతే అంబలన్నా దక్కుతున్నాది"

"ఎప్పటిలానే బండి తోలుకుంటున్నావా?"

"మరేటిసెయ్యను బాబూ, కాళ్ళేతులు రెస్టు అడుగుతుంటే నోరు కూడడుగుతాంది!"

కిర్రితం ఏడాది జరిగిన భూఁవి పంపకం గురించి జనం ఏఁవనుకుంటున్నారో తెల్సుకోవాలనిపించి

"ఓల్డుసన్, నీ బూఁవి నచ్చిందా?" అని అడిగేడు.

"శానా మంచి బూఁవి బాబూ. ఏదేసినా బంగారంలా పండుతాది"

వాన్ నీళ్ళడేగిశా తీసుకొచ్చి ఓల్డుసన్‌ని చూస్తూనే నవ్వేసేడు. లీకీ - యంగ్ తన గురించి నిజంగానే ఏదో చెప్పేసేడని ఓల్డుసన్ ముఖం చిన్నబుచ్చుకుని సియావో దగ్గరకు జరిగి,

"అలు యిక్కడికెందుకొచ్చినారు? నన్ను బైటపెట్టీడానికే? అలని నాను బైపెట్టాలిగాని అలు నన్నేటిసేస్తారు? జనాన్నేగాదు ఆపీసర్లని కూడా దగాసేసినోల్లు. నువ్ ఎల్లి పోనావుగదా బాబూ, ఇక్కడేటవుతోందో సూసేందుకు ఆపీసర్లొచ్చేరు.

అలు జనంతో మాటాడాలనుకుంటే పడనిచ్చేడు కాదు చాంగ్. ముసిలోలు తప్ప అందరూ పొలాలు పోయేరన్నాడు, ఆఫీసర్లు అలనే తీసుకురమ్మన్నారు. చాంగ్ ఏటిసేసేడనుకున్నావ్? ఓ గుడ్డోడిని, ఓ సెవిటిదాన్ని తీసుకొచ్చినాడు. "ఈ ఊల్ల సెడ్డోల్లున్నరా?" అని ఆఫీసర్లడిగితే "మాం చేమ్యా తినం బాబూ అంబలే తింతాం" అందాసెవిటిది. ఎన్ని అడిగినా ఆ మనిషి 'ఎడ్డెమంటే తెడ్డె' మంది. ఆఫీసర్లకి ఏడవాలో నవ్వాలో తెల్సిందికాదు. "దానికి సెవుడు. నన్నడగండిబాబూ సెప్తాను" అన్నాడు గుడ్డోడు. కాని అప్పుడే బోయినానికి తీసుకుపోయి చాంగ్, లీ అలకి పూటుగా తాగపోయించేరు. మరింక అలాంతోలు నామీన ఏటిసెప్తారు?" అని అక్కసంతా వెళ్ళగక్కేడు.

తీన్‌తాత సియావోని భోజనానికి పిలవడానికొచ్చి ఓల్డుసన్‌నికూడా ఆహ్వానించేడు.

"బోయినం మాబాగున్నాది" అన్నాడానందంగా ఓల్డుసన్.

"పుల్లలమ్మితే పైసలొచ్చేయి. సియావొ బాబుని బోయనానికి పిలవాలని మా ముసిల్దానికి మాయిదిగావుంది. ఈబాబు ఇక్కడుంతే మనకిదెయిర్నం. సెడ్డోల్లకి యికకాలంసెల్లిపోనాది" అన్నాడు తృప్తిగా తీన్‌తాత.

## 5

మధ్యాహ్నం అయేసరికి పేదరైతుల, కంబార్ల సమావేశం పూర్తయింది. జనం రెండుగుంపులుగాచీలి, ఒకగుంపు చాంగ్‌ఫూ-యింగ్ కోఆపరేటివ్ స్టోరుకి, మరోగుంపు చాంగ్‌ని పట్టుకోడానికి హడావుడిగా వెళ్ళేరు.

స్టోరుకి వెళ్ళినవాళ్ళు వాసననూనెలు, సెంట్లు, లిప్‌స్టికులు, ఖరీదైన సబ్బులు వున్న అరలన్నీ గాలించేరు. ఓల్డుసన్ లిప్‌స్టిక్‌తీసి వాసనచూస్తూ "రైతుదీంతో ఏటి సేసుకుంతాడు?" అనిఅడిగేడు.

"ఇంటికట్టుకుపోయి నీ ముసల్దాన్ని రంగేసుకోమను" అనిసరసమాడేడు 'చూ' పట్టించుకోకుండా "ఇక్కడ గుర్రంజీనులమ్మాప, సెన్నాకోలలమ్మరు. ఏడేటో ఎట్టేసి 'ఇదే కోపరీటివ్‌టోర్' అంతారు" అన్నాడు.

"ఈస్టోరు ముండల్ని సేరదీస్తాది" అన్నారెవరో జనంలోంచి.

అక్కడికక్కడే మీటింగు పెట్టేరు. స్టోరులోంచి, బైటనించికూడా "ఆలపని పట్టాల"అని అరుపులు వినిపించేయి.

కువో చువాన్-హై అంతా చూస్తూ, వింటూ పైపుకాల్చుకుంటూ బల్లమీద కూర్చున్నాడు. అంతగోలలోంచి 'చూ'గొంతు పెద్దగావినిపించింది– "ఇదేనేటి మన స్టోరు! సంచిలోపిల్లినెట్టి అమ్మేసి మన్ని మోసంసెయ్యాలని సూత్తుండారు నాయాల్లు"అని.

"ఆలలంతు సూడాల్సిందే"నన్నారు చాలామంది.

"మనకెట్టినసష్టం ఆలే భరించాల" అన్నారు కొందరు.

ఓ ముసలావిడ అగరొత్తుల కట్టొకటి జేబులో వేసుకోబోయింది 'చూ' ఆమెని వారించి "దేన్నీ ముట్టుకోకండి. ఎక్కడి సరుకు అక్కడే వుండాల" అని జనా నుద్దేశించి "మనంవంతా కలిసి సదురుదాంరండి" అని పిల్చేడు.

"ఎవరికాడన్నా కాయితం వున్నాదేటి? సిన్నముక్కలుసేసి ఈ అలమార్లకి సీలు ఏసీద్దాం"

అందరు కలిసి సామానంతా సర్దేసేరు. ప్రతి అలమారుకి సీలువేసేరు. ఇంతలో ఓల్డ్‌సన్ సారాపీపా దగ్గరకు చేరేడు. మూతతీసి గ్లాసుతో కొంతతీసి పైకి పట్టుకుని, ఎడంకన్ను చికిలిస్తూ "సారాయిలో నీళ్ళుగాని కలిపేరేమోనని రుసిసూస్తుండా" నంటూ గుటకలువేసేడు. గ్లాసుపైన గ్లాసు ఖాళీ అవుతుందేగాని ఓల్డ్‌సన్ రుచిచూడడం పూర్తి కాలేదు. అతని కళ్ళు కూడా ఎర్రబడ్డాయి.

సియావో కువోదగ్గరికొచ్చేడు. చాంగ్ తప్పుడు లెక్కలు బైటపెట్టేందుకు ఒక అకౌంటెంట్‌ని నియమించాలని, అతని ఉద్దేశ్యం. ఇంతలో చాంగ్, లీ, తాంగ్‌లతో పాటు చాంగ్ చింగ్-షీ మరో అయిదుగురు కొత్త సైనికులొచ్చేరు. చాంగ్, లీ, తాంగ్‌ల చేతులు వెనక్కి కట్టేసివున్నాయి. తప్పతాగిన ఓల్డ్‌సన్ ముందుకొచ్చి తన శత్రువును తన్నేందుకు కాలుఎత్తితే కువో ఆపేడు.

"ఓల్డ్‌సన్, తమాయించు. ఎవుర్నీ కొట్టొద్దని సియావోబాబు సెప్పనేదా?" అంటూ,

"పెద్దోల్లని కూడా ఒకరిద్దరిని కొట్టరాదేటి?" అని అమాయకంగా అడిగేడు.

"పెద్దవాళ్ళని కూడా కొట్టొద్దు" అన్నాడు సియావో.

అలా ఎందుకన్నాడో వివరించేడు. ఎంతో ఘోరమైన తప్పులు చేస్తేతప్ప ఎవరినీ కొట్టి శిక్షించగూడదు. వాళ్ళ తప్పులొప్పుకుంటే కూడ శిక్షించగూడదు. వాళ్ళ ముగ్గురికీ కట్టినతాళ్ళు విప్పించేడు. వాళ్ళని ఇళ్ళకువెళ్ళి బాగా ఆలోచించుకుని తప్పులొప్పుకోమని, వాళ్ళ పొలాలు దున్నుకోమని విడిచిపెట్టేసేడు.

జనంలోంచి కేకలు :

"ఆలనలా సుల్గాగా ఒగ్గిడఁవే?"

"అంత సెడ్డోలకీ ఇంతేన సిచ్చ?"

ఇద్దరాడవాళ్ళు "చాంగ్ పారిపోడంతావా?"

"ఆడికన్నిదమ్ములున్నాయేటి?"

"ఆలని ఓ కంట కనిపెడుతుండాలి. నేపోతే పొడుగుమెడహన్ నాగు కొండల్లోకిపోయి శానా ఇబ్బంది పెట్టీస్తారు" అనుకున్నారు. ఆఖరిమాట విన్న సియావో పక్కనే వున్న చాంగ్ చింగ్-షీ కేసి "విన్నావుకదా, ఆ పూచీ నీదే" నన్నట్టు చూసేడు. చాంగ్ చింగ్-షీ అర్థవంతంగా నవ్వేడు.

సియావో చాంగ్‌ఫూ-యింగ్‌తో "నీ తప్పులు ఒప్పేసుకోవయ్యా. గ్రామస్థులకు క్షమాపణ చెప్పుకో"మన్నాడు.

చాంగ్ అసహ్యసూచకంగా ముఖం చిట్లించి "నానేటి తప్పుసేసేను? నన్ను ఆలే సైర్మన్ సేసేరు. నానెప్పుడూ తప్పటడుగు ఎయ్యనేదు. రూలుదాటి అటూ యిటూ నడవనేదే, నాను తప్పులు సేయనేదే" అన్నాడు.

చివ్వన ఓల్డ్‌సన్ లేచి అతని మొఖంమీదే "నిన్ను సైర్మన్‌సేసింది నీ సుట్టాలు, నీ ముటావోలూను. "నువ్వు నా యీపు గోకు, నేను నీ యీపు గోకుతా" నన్న తంతు మీది. మీ గుంపంతా రైతుసంగంలో దూరి తిన్నారు, తాగేరు, జల్సాసేసి కొవ్వెక్కి పోనారు, నాయాల. ఇదంతా ఎవడబ్బ సొమ్మేటి?" అని అరిచేడు.

ఒక పక్కగా నుంచున్న ఆడవాళ్ళ గుంపులోంచి రెండుజడలు వేసుకున్న ఓ పదహారేళ్ళపిల్ల ముందుకొచ్చింది. ఆమె లీకీ-లాన్ తు ఇంట్లో వాళ్ళ పదేళ్ళ పిల్లవాడికి కాబోయే భార్యగా ఆమెను పెంచుతున్నారు- చాకిరీ చేయించుకుంటూ. ఆవిడ కందగడ్డలా ఎర్రబడ్డ మొఖంలో పిడికిలి బిగించి చాంగ్‌తో "ఇప్లవం కోసరం నెత్తురు సిందించినోల పెల్లాంబిడ్డలకి నువ్వేటిసేసేవ్? అప్పుడే రూలు మీద నడిసేవ్?" అని తీవ్రంగా అడిగింది.

చాంగ్ మొఖం పాలిపోయింది. సమాధానం చెప్పలేకపోయేడు. చూ ముందుకొచ్చి, "ఓరోజు మాఁవంతా పొలాన పనిసేత్తాంటే నువ్వు సిన్నమీ పొదల్లోకి పోయి ఎంతకీ బైటికిరానేదు" అని నవ్వాపుకుంటూ "ఏటిసేసేరేటి?" అన్నాడు.

జనం గొల్లుమన్నారు. కొందరు చాంగ్‌ని తిట్టిపోస్తే మరి కొందరు చాంగ్ చిన్న మీలను కట్టిపడెయ్యాలన్నారు. ఇంకొందరు వాళ్ళిద్దరిని బాగా ఉతకాలని సలహా ఇచ్చేరు. సియావో జనాన్ని ఆపి చాంగ్, మిగతా ఇద్దరు ఆలోచించుకునే టైమివ్వాలనీ, వాళ్ళని ఇళ్ళకు వెళ్ళనివ్వమనీ చెప్పేడు. చాంగ్‌ని.

"సరే, ఇకమీరు వెళ్ళొచ్చు. తర్వాతవచ్చి తప్పులొప్పుకోండి. కుళ్ళి పోయిన మీ మనసులు శుభ్రిపరచుకుని జనాన్ని క్షమాపణ వేడుకోండి." అని,

లీకీ - యంగ్ వేపు తిరిగి, "నువ్వుకూడా నీ తప్పు ఒప్పుకోవాల్సి వుంటుంది" అన్నాడు. లీ అతివినయం ఒలకబోస్తూ, వంకరగా నవ్వి "అలాగే. నీకు టైము న్నపుడు నీతో మాటాడాలి సియావో బాబూ" అన్నాడు.

"అది తర్వాత చూద్దాంలే"

"సరే, ఇక మాఁవెల్తాం"

లీ వెళ్ళిపోతూ పొరపాటున తొక్కినట్టు ఓల్డ్‌సన్‌కాలు బూటుకాలితో తొక్కేడు. అతను కెవ్వున అరిచేసరికి "ఏటనుకోకు మాఁవా, తప్పయిపోనాది" అన్నాడు.

"పో, పోవయ్యా! నువ్వు సేసిన తప్పులకు నాకాలు తెక్కిసినావు. బేగిపో. ఇక్కడ నీకు సోటునేదు. ఇది మాది"

వాళ్ళు పోయేక సియావో చాంగ్ చింగ్ - షితో నెమ్మదిగా "ఈ లీని జాగ్రత్తగా కనిపెట్టాలి" అన్నాడు.

ఈ తప్పుడు రైతుసంఘంలో, కోఆపరేటివ్ స్టోరులో వున్న వస్తువులన్నీ చూసి లెక్కలు తయారుచేయడానికి ఓ కమిటీవేసేరు. కువో, చూ, ఓల్డ్‌సన్ ఆ కమిటీ మెంబర్లు. 'ఆటలమ్మ'కి మందులిచ్చే డాక్టరొకతనికి రాయడం, లెక్కల బల్ల* మీద లెక్కలు చేయడం చేతనవును. అతనే ఆ కమిటీ సెక్రటరీ.

* abacus

(ఇంకా వున్నది)

శ్రవ్యనవల ?

## దూరానికి దగ్గరగా

భాష ప్రాథమికంగా శ్రవణ చిత్రణం. రాతలో కూడా లిపికి మూలం, గమ్యం శ్రవణ యోగ్యమైన ధ్వనే. భాషలాగే భాషలో కూర్చే సాహిత్యమూ శ్రవణ ప్రధానం. భాషలో నోటి వ్యవహారం, రాత వ్యవహారం ఉన్నట్లే సాహిత్యంలోనూ నోటికూర్పూ రాతకూర్పూ అని రెండు పద్ధతులున్నాయి. నోటికూర్పు వినడానికి ఉద్దేశించింది. రాతకూర్పు చదువుకోవడానికి ఉద్దేశించింది. ఈ రెండింటిలోనూ తరతమ భేదాల్తో కూర్పు అనే దానికి గమ్యం శ్రవణం. నోటి కూర్పులో కూర్పరి (వక్త), శ్రోతల మధ్య సంబంధం ప్రత్యక్షం, పరస్పరం, రాతకూర్పులో రచయిత, పాఠకుల మధ్య అలాంటి సంబంధం ఉండే వీల్లేదు. కనుక అది పరోక్షం, ఏకముఖం. అంటే రచయిత వాడే భాషా రూపాలకూ, భావ వ్యక్తీకరణ రీతులకూ పాఠకుడు అలవాటు పడతాడు. ఇందులో ఒక విధంగా రచయితకు ఒరవడి పరోరచన- మాట్లాడే వ్యవహర్త కాదు. సాంకేతికంగా జరిగే ధ్వని ముద్రణ, ధ్వని ప్రసారాల్లో నోటి కూర్పుకూడా పరోక్షం (ఉదాహరణకు సౌండ్ రికార్డింగ్ పద్ధతులు, రేడియో, సినిమా, టెలివిజన్ మొదలైనవి). నోటి కూర్పు అనేది సాహిత్యంలో మౌఖిక లేక ఆశు సంప్రదాయంలోకి చేరుతుంది. రాతకూర్పు లిఖిత సంప్రదాయంలోకి చేరుతుంది.

నవల మొత్తం మౌఖిక సంప్రదాయంలో కూర్చినట్టు రచయిత చెప్పుకున్నాడు. పల్లె ప్రజల భాషలో మొత్తం రచనను కూర్చడం, ఒకటి రెండు మాటల్తో పాత్రల రూపురేకల్ని, వయోవృత్తి విశేషాల్ని తెలిపే పేర్లను వాడడం, నోటికూర్పు ఒరవడిలో శోకాలు, సామెన్లు, తిట్లు, దీవెన్లు, వాదాలు, వివాదాలు, తంటాలు, తీర్పులు, మొరలు, మొక్కుకోళ్లు, వేళాకోళాలు, వేడికోళ్లు, గద్దింపులు, ఎదిరింపులు, పౌరుషాలు, ప్రతాపాలు, రోషాలు, కావేషాలు, ఆశలు, ఆరాటాలు, అక్కరలు, అక్కసులు, నిందలు, నసుగుళ్లు, నీతులు, సమ్మరాలు చిత్రించే సంభాషణల్ని పల్లెజీవితంలోంచి ఏరి, వెలికితీసి, సందర్భానుగుణంగా పాత్రోచితమైన వ్యక్తీకరణ రీతుల్లో పలికించడం, సామెతలు, జాతీయాలు అడుగడుగునా పొదగడం, రాతకూర్పు పద్ధతిలోలా సంఘటనల్ని ముందు వెనకలుగా కూర్చకుండా సోపానక్రమంలో పేర్చడం మౌఖిక సంప్రదాయ రీతుల్ని రచయిత పాటించాడనడానికి నిదర్శనాలు.

ఆదిలాబాదు, కరీంనగర్ ప్రజల భాషలో ఇది మొదటి నవల. ఇటీవల ఓ వందేళ్ళుగా సమాజంలో చెప్పుకోదగిన మార్పులేర్పడ్డాయి, రాచరిక వ్యవస్థ

అంతరించింది. భూస్వామ్య వ్యవస్థ పునాదులు కదులుతున్నాయి. ఈనాటి అవసరాలకు అనుగుణంగా విద్యావైజ్ఞానిక రంగాల్లో, పాలనా రంగంలో రాత సంబంధమైన భాషోపయోగం పెరిగింది. చదువుకున్న వారి సంఖ్య పెరిగింది. ముద్రణ వల్ల అచ్చుపుస్తకాలు, పత్రికలు వచ్చాయి. పాఠకుల సంఖ్య పెరిగింది. క్రమంగా వివిధ ప్రసార, ప్రచార సాధనాలొచ్చాయి. అందువల్ల రాతలోనేగాక మౌఖికంగా కూడా భాషోపయోగం బహుముఖంగా పెరిగింది. అసంఖ్యాకమైన పాఠకులకు, శ్రోతలకు అర్థమయ్యే భాషా రూపం ఒకటి రూపొందించు కోవలసిన అవసరం ఏర్పడింది. ఇది చారిత్రికంగా ఏర్పడిన అనివార్యస్థితి. దీనివల్ల ప్రాచీన రచనాభాష ('గ్రాంథికం') స్థానంలో నవీన రచనా భాష ('వ్యవహారికం') ఒకటి రూపొందింది. రెండు ప్రధానంగా రచనావసరాల కోసం ఏర్పడిన రూపాలే. మొదటిది నిత్యవ్యవహారంలో లేనిది- రెండవది 'శిష్టులు' (నాగరికులు, చదువుకున్నవారు) పరిమిత వ్యవహారంలో వాడేది. ఇవి రెండూ చదువురాని పల్లెప్రజల వ్యవహార రూపాలుకాదు. రాతలో సాహిత్యం చదువుకున్న వారికే అందుతుంది అనే దృష్టితో ఈనాటి సాహిత్య సృష్టి అంతా దాదాపు వ్యవహారికంలోనే జరుగుతున్నది. దీనివల్ల సాహిత్యం విస్తృత పాఠక లోకానికి చేరే సౌలభ్యం ఏర్పడింది.

కాని సృజనాత్మక రచనలకు విస్తృతికన్నా జీవిత వాస్తవికతను సహజరీతుల్లో మలిచే కళాత్మకత ముఖ్యం.

సౌలభ్యం కోసం ఏర్పరచుకున్న రచనాభాష ప్రచురణ కర్తలకు, పత్రికాధిపతులకే కాక డబ్బు చేసుకోవడానికి రచయితలకూ బాగా తోడ్పడింది. దీనివల్ల సహజత్వం కోసం ప్రయత్నించిన మాండలికంలోని మంచి రచనలకు కూడా పాఠకుల కొరత ఏర్పడింది.

మాండలికంలో రచించడం మాటల్తో అయ్యేపనికాదు. రచయితకు జన జీవితంతో సన్నిహిత పరిచయముండాలి. ప్రజల భాషతోపాటు ప్రజల నిత్యజీవితంలోని భావజాలం దాని వ్యక్తీకరణ రీతులు తెలియాలి. రచయిత భాషారూపాల ప్రయోగంలో మరో రచనపై కాకుండా భాషా వ్యవహర్తలపై ఆధారపడవలసి వస్తుంది. అందుకు ఇతర కౌశలాలతోపాటు భాషా విషయకంగా రచయిత గ్రహణ, మనన శక్తులు కూడా చాలా నిశితంగా పనిచేయాల్సి వస్తుంది. అంతేకాక మౌఖిక వ్యవహారంలోని భాషా ప్రయోగాల్ని సృజనాత్మక రచనల్లో సహజరీతుల్లో కళాత్మకంగా మలిచే నేర్పుండాలి. ఇన్ని పరిమితులవల్ల మాండలికంలో రచనకు పూనుకున్న రచయితకు తన సామర్థ్యంపై కృషిపై తనకే పూర్తి నమ్మకం కుదరదు. అందువల్లే

కొందరు రచయితలు తమ అసర్థతను ('పరిచయం'లో ఉన్నవ లక్ష్మీనారాయణ- 'మాలపల్లి'), భయాన్ని ('మనవి'లో వట్టికోట ఆళ్వార్‌స్వామి- 'ప్రజల మనిషి'), జంకును ('తొలిపలుకు'లో పోరంకి దక్షిణామూర్తి 'ముత్యాలపందిరి') వ్యక్తం చేసిన సందర్భాలు కనిపిస్తాయి.

అల్లం రాజయ్యకు ఈ జంకు గింకులు లేవు. 'నాకు తెలిసిన భాషలో తప్ప రాయడం కుదరడం లేదు' అనే గడుసుదనంతో కూడిన నిజాయితీ, 'ప్రజలు జీవించిన జీవితం - అందులోని సంఘర్షణ ఉత్పత్తిక్రమంలో వాళ్ల సంస్పందన నుండి పుట్టిన భాషలోనే' రాయాలనే శాస్త్రీయమైన అవగాహనా ఇతనికున్నాయి. అయినా ఇతనూ ఇటీవలి రచనలకు టీకాటిప్పణి సమకూర్చుతున్నాడు- అర్థంకాదనే భయంతో.

నవల ప్రధానంగా కథన ప్రక్రియ. సంభాషణలు అవసరమైన చోట్ల వాడినా రచయిత కథనానికే ప్రాధాన్యత ఇందులో. ఈ నవలలో కథనం అంతా దాదాపు సంభాషణల ద్వారా జరుగుతుంది. మాట్లాడేపాత్రలే వంద ఉన్నాయి. మాట్లాడని మూగపాత్రలు ఏభై. రచయిత పాత్రల్ని జంటలుగా గుంపులుగా పేర్కొన్న సందర్భాలు మరో ముప్పైఅయిదు. ఇందులోనూ నాలుగైదు చోట్ల పాత్రలు మాట్లాడతాయి; ఈ విధంగా ఇది ఒకరకమైన శ్రవ్యనవలగా రూపొందింది. ప్రక్రియ ద్వారా జీవితాన్ని చూడడంకాకుండా జీవిత వాస్తవికతను మలిచే విధంగా ప్రక్రియా నిర్మాణంలో మార్పులు సంతరించుకొన్న రచన. గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' (రెండో కూర్పు) తర్వాత అంతటి శ్రవ్యతను, సంభాషణాదక్షతను, జనజీవన చిత్రణంలో సమగ్రతను సాధించిన అపురూప రచన 'కొలిమంటుకున్నది.'

నవలలో ఈనాటి ఆదిలాబాద్ - కరీంనగర్ రైతాంగ పోరాటానికి ముందు పరిస్థితులు కనిపిస్తాయి. కథారంగం పల్లెపట్టు. సన్నకారురైతు పెరడు, పెరడులోని మంచె, దొరతోట, పొలం, పొలంలోని కల్లం, చెరువుగట్టు; ఊళ్లోని వీధులు, మాదిగవాడ, బూలచ్చిమి; దొరగడి, గడిలోని దొరగది, మాలీపటేల్ బంగ్ల, పట్వారి ఇల్లు, షావుకారిల్లు, సన్నకారురైతు ఇల్లు, నీరటికాని గుడిసె; పట్నంలో పోలీస్‌ఠాణా, హోటల్ గుడిసె, కరెంటాఫీసు ఇవి కథా రంగస్థలాలు. ఇందులో ఉత్పత్తి సాధనాలు, పనరులు అరచేతపెట్టుకుని ఆడిస్తున్న దోపిడీవర్గం, ఈ వ్యవస్థలో దాని ప్రయోజనాల్ని సంరక్షించే పాలకవర్గం, సహకరించే దళారీవర్గం, దోపిడీకి, దుర్భరమైన పీడనకు గురౌతున్న పీడితవర్గం ఇలా భిన్న తరగతులకు ప్రాతినిధ్యం

వహించే పాత్రలున్నాయి. వీళ్ళల్లో దొరలు, ప్రభుత్వోద్యోగులు, గ్రామోద్యోగులు, షేకేదార్లు, కోమట్లు, పోలీసులు, సుంకరోళ్లు ఉన్నారు. సన్నకారు రైతులు, పాలేర్లు, నీరటికాళ్లు, కయికిలికాళ్లు ఉన్నారు. ఆడవాళ్లున్నారు. ముసలాళ్ళున్నారు. పడుసోళ్లున్నారు. పోరగాళ్ళున్నారు. మురికిబట్టలుతికే మూగ మూగ సాకలోళ్ళున్నారు. గూడు చెదిరినోళ్ని, గుండె చెదిరినోళ్ని ఆదుకునే కల్లుగీసే గౌండ్లోళ్లున్నారు. పోలీసోళ్లనే అరెస్టుచేసిన సొదరిపల్లెలోని బాలసంతోలున్నారు. సెక్కాముక్కోని సెక్కానాల ఇండ్లు గట్టిన సెక్కసేటు, చేతిలో రూపాయి పెడితే ఆఫీసుగదిలోకి పంపించే జవాను ('కన్యాశుల్కం'లోని అసిరిగాడు), కొంచెం సేపు ఆలస్యమైతే కొలువుంచుకున్నోడు కోపగిస్తాడనే భయంతో ఎటూ తోచక చేసుకున్న పెళ్ళాన్ని నడివీధిలో కొట్టే అర్థంకానిస దుడ్డెగాల్ల సెందిరిగాడు, 'పెండ్లాన్ని సేసుకున్నది - ఎటు వడితటు గొడ్డును గొట్టినట్టు కొట్టెటందుక్కాదురా ? లచ్చికొడుక - అది ఎద్దనుకున్నవ, గొడ్డనుకున్నవ - మనిషిరా !' అంటూ వయసిచ్చిన అధికారంతో వాణ్ణి నిలదీసి అడుగుతూ సిల్లు పుక్కిలించి ఊంచినట్టుగ నవ్వే గూనిముసలవ్వ - ఇలా ఎన్నెన్నో సజీవ పాత్రలు. వ్యవస్థ ఉక్కుపాదం కిందబడి నలిగి, మగవారి కష్టాల్లో కన్నీళ్లలో పాలు పంచుకుంటూ కడుపులోని సొదను కడుపులోనే దాచుకుని మూగబాధననుభవిస్తున్న ఆడవాళ్ళ జీవితాల్లోని చీకటి కోణాల్ని, పోరాటక్రమంలో అంతర్లీనంగా వారి పాత్రను రచయిత పూసల్లో దారంలా పొదిగాడు.

తాత్కాలిక ఆర్థికపోరాటాలు, సమిష్టి కార్యాచరణలో ఆర్థిక ఒత్తిడులవల్ల ఏర్పడే సర్దుబాట్లు, పీడితవర్గంలో పోరాటబీజాలు మొలకెత్తి క్రమంగా సమిష్టి కార్యాచరణకు దారి తీయడం, వ్యక్తి చైతన్యం వర్గచైతన్యంగా రూపొందిన తీరు, అందుకు పురికొల్పిన అనివార్య వర్గసంఘర్షణ రచయిత పోరాట దక్షతతో చిత్రించాడు.

'కూడుబెట్టినా కూలగొట్టినా బూదేవరే ! దాని కోసం నేనెన్ని తిప్పలుబడ్డనో. పరమేశునికెరుక - అన్ని తిప్పలుబడి కాకుల గద్దల నుంచి కాపాడిన - నేను ఎట్లా బల్లి తీర్గ కరుసుకొని కాపాడిన్నో ! సువ్వు గట్లనే దక్కియ్యాలె - ఆకలితోని సత్తె అండ్లనే సావుండ్రి - బతికితె అండ్లనే బతుకుండ్రి - కని కోమటోని కాడ అప్పులు సేయకుండ్రి' అంటూ తన బతుకులోని చీకటంతా విప్పిచెబుతాడు రాగిమీసాల సాంబయ్య. కరువులు పెరుగుతుంటే ఆశలు పెంచుకుంటూ చివరకు 'ఎవుసాయమువ్వ ! ఎవుసాయంసేసి ఏష్టచ్చింది. కొనబోతే కొరివి అమ్మబోతె అడివున్నది - మనకే మన్ను పండిందంటే కోమటోడు అటెగిరేసి, ఇటెగిరేసి రంగులేదని, సత్తలేదని అనిట్ల మచ్చినంతిత్తడు - రెక్కల కట్టం అటుంచి పెట్టినదే తిరిగిరాదు. ఇంటికి త్తచ్చింది లేదు - సేసిన అప్పులు తీరింది లేదు' - అంటూ నైరాశ్యంతో ఉన్నది తెగ నమ్మి కొడుకు కొలువుకు లంచాలు పోస్తాడు సన్నకారు రైతు ఎంకటాపురం అయిలయ్య.

అకలి అప్పులు పేదవాళ్ళని అనివార్యంగా బానిసతనంలోకే నెడుతుంటే 'పండిచ్చేది మనం తినేదిఇంకోల్లు' అని గ్రహించిన ముందుతున్న యువతరం ప్రతినిధి సెంద్రియ్య 'ముదుగాల బతుకేర్పడితె ఏ పని జేసుడో తేల్తది- నేను ఒకల కోసం పన్జేయ- నాకోసరం పనిజేసుకునే దనుక గిట్లనే తిరుగుత- సత్తె కొట్లాడుకుంటనే సత్త' అంటాడు.

వర్గకసిని స్వయంగా రుచిచూసినా మౌలికంగా ఉత్పత్తి సాధనాలూ, వనరులూ పీడిత ప్రజల పరం కానంత వరకు ఈ వైయక్తికమైన తిరుగుబాట్ల వల్ల దోపిడీ అంతం కాదని గ్రహించిన రైతు- కూలి నర్సిమ్మ 'పగదీర్సు కోవటంగాదు- మనగ్గావాలె బూములు- మనలను సంపకుంట, తన్నకుంట దొంబుద్ది గలిగున్నా మన కట్టం దీరది- మన ఎట్టితప్పది- మన కట్టాలు తీరాలంటే మనకు బూమిగావాలె- దాని కోసరము- మనండ్ల ఎందరం సెల్లిపోయినా ఫర్వాలేదు' అని పోరాట లక్ష్యాల్ని నూరిపోస్తాడు. 'దొర పుట్టంగనే బూములు బుజానేసుకుని పుట్టిండా? అందరి తీర్గ బరిబాతనే పుట్టిండు. బూమి, సీల్లు, గాలి, ఆకసం, నిప్పు ఒకల్లయని ఏడనన్న రాసున్నదా? ఎవడు కొండ్రవేసి దుక్కిదున్నితె ఆనిదే బూమి- ఎవడు పాలెబడితె ఆనిది అరుక- ఎవడు మేపి, సాది సవరిచ్చిన జెత్తె ఆనియి ఎడ్లు- ఇన్నరా? నే నేడాదికింద బూమున్నోన్నే- ఇయ్యాల్ల రెండు రెక్కలే మిగిలినయి- ఏడబోయింది నా బూమి?' అంటూ అదిమ కమ్యూనిస్టు సమాజపు **అవగాహనతో** వ్యవస్థ మర్మాల వివరమడుగుతాడు.

నిత్యపీడనలో మగ్గిపోయిన ముదిపగ్గు గుడ్డిగట్టయ్య 'ఏంరాజ్జెం-సావురాజ్జెం-దొరల రాజ్జెం-దొంగల రాజ్జెం- మీకు గిప్పుడు తుపాకులున్నయ్- బక్క నక్కోలను అదిరిచ్చుక బెదిరిచ్చుక రాజ్జెం నడుపుకొత్తండ్లు- మొగోలైతే గీడదున్నేటోల్లకు బూములిప్పియ్యండ్లి! కట్టపడ్డోనికి కంకెడు కూడు దొరికేట్టు సెయ్యండ్లీ- అట్ల సాతగాదో నాసేతికి తుపాకు లియ్యండ్లి అంటాడు.

ముప్పైరెండో స్వాతంత్ర్య దినోత్సవం మొన్ననే జరుపుకున్న దేశం 'కల్లోలిత' ప్రాంతాల్లో జరుగుతున్న రైతాంగ పోరాటానికి ముందుదశలో సమీకృతమౌతున్న ప్రజా వెల్లువ చైతన్యం వివిధదశల్ని ఆటుపోటుల్ని కళ్ళకు కట్టినట్టు చిత్రించే మొదటి పోరాటజీవిత చిత్రణం- ఈ రచన. ఇది నవలా? నాటకమా? రెండునా? కాదు- దీర్ఘకాలిక విప్లవ పోరాట క్రమంలోని ఒక దశకు మొదలు.

తిరుపతి
20-8-1979

— పెంచుకలపాడు చిననరసింహారెడ్డి

# సృష్టికర్తలు

అల్లం రాజయ్య

ఇంకా సూర్యోదయమన్నా కాలేదు. ఆకాశం కడిగిన పళ్ళెం తీరుగున్నది. తూరుపు దిక్కు ఒకటీ అరా మేఘపు ముక్కలు ముఖం మాడ్చుకొని వెళ్ళాడుతున్నాయి. ఉదయించని సూర్యకాంతి ఆకాశానికి ఎర్రమట్టి పూసినట్టుగున్నది. చెట్ల ఆకులు రాత్రి కురిసిన వర్షానికి పచ్చగా నిగనిగలాడుతూ లోకంలో ఇంకా ఏ అన్యాయం చూడని పసిపిల్లల ముఖాల్లా వెలిగిపోతున్నాయి. గాలి ఉండీ ఉండీ వీస్తోంది. ఆ గాలికి గుట్టబోరు కింది భాగంలోని ఈత లేతాకులు "బొంయ్యి" మని శబ్దం చేస్తూ కదులుతున్నాయి. కొండరాళ్ళ మీదినుండి జల జల ఇంకా రాత్రి కురిసిన వర్షపునీళ్లు జారుతూనే ఉన్నాయి. వాగు ఎర్రనీళ్ళతో నిండి అదేదో సందడిగా, అలజడిగా అనేక మంది కలిసి తర్జన భర్జన పడుతున్నట్లుగా పారుతోంది. చెట్లకొసల మీద అప్పుడే స్వేచ్ఛ పొందినట్టు, ప్రపంచంలోని సంతోష మంతా తమదేనన్నట్లు పక్షులు పల్టీలు కొడుతున్నాయి. అడివి అంచుకు పచ్చగా నవనవ లాడుతున్న గడ్డిని విడిచి కొన్ని పశువులు ఒకటి నొకటి గెదుముకుంటూ చెంగలిస్తూ ఆడుకొంటున్నాయి. ముసలి ఎడ్లు సయితం లెంకలేసి పుట్టలు చిమ్ముతూ ఎర్రమట్టి కొమ్ములకు, ముఖాలకు పూసుకొని వీరోత్సాహంతో ఉన్నాయి. అన్నికాలాలు తెలిసిన వాటిలాగా, సంతోషం, విషాదం లేనట్టుగా, తమకీ సందడి పట్టనట్టు బర్లు వాగులో అక్కడక్కడ తేలిన తుంగ గడ్డలను బరుకు బరుకున పీక్కతింటున్నాయి. వాగొడ్డు ఎర్ర చెలుకలనుండి అక్కడక్కడ పురుగులు లేసి తిరుగుతున్నాయి. ఆరుద్ర పురుగులు నేలమీద పాకుతున్నాయి.

అదిగో అలాంటి వాతావరణంలో తూర్పు దిక్కు సూర్యుడు ఉదయించాడు. సూర్యునితో పాటు కిరణాల్లాగా భుజాలమీద నాగళ్లెత్తుకొని, పలుగు పారా బట్టుకొని నేల ఈనినట్టుగా జనం ఎర్ర చెలుక వేపువచ్చారు.

నాగండ్ల వాళ్లు నాగండ్లు చెలుకలో దించి తాళ్లు సరిచేస్తున్నారు. స్త్రీలు కొంగులు నడుములకు చుట్టి రాళ్లరప్పలేరుతున్నారు. పెయిమీద అంగీలు లేనివాళ్లు కొందరు నోట్లె మొక్కసుట్టలు అవలపారేసి పాతగుడ్డపేగులు తలలకు చుట్టి పగ్గాలు విప్పుకొని అడవి అంచు ఎడ్లను పేరుపేరున పిలుస్తూ ఎడ్ల ముక్కుదాళ్ళకు పగ్గాలు కట్టి నాగండ్ల దగ్గరికి తీసుకొచ్చారు. కానికి మొక్క కొందరు ఎడ్ల మెడల మీద కాని ఆనించారు. నాగండ్లు నిలబడ్డయ్.

ఎర్రతేలులాంటి ఎల్లయ్య ఎక్కన్నో నాలుగు ఈత పెండెలు విరుసుకచ్చాడు. ఎల్లయ్యభార్య ఒళ్ళె నుంచి నాలుగు ఎర్రజెండలు తీసింది. ఎల్లయ్య కొయ్యలకు జెండాలు తగిలించి నాలుగువేపుల నాలుగు పాతచ్చాడు.

బుర్రమీసాల బుచ్చిలింగం అందరిని ఓపారి తేరిపార చూసిండు- అతని మనసులో వాగులోని ప్రవాహంలాగా మాటలులేని సంతోషం పోటెత్తుతోంది- కుర్వె కట్టె చేతబట్టి కొండ్రలు గీసిండు- పొట్టిలాలయ్య ఓడిగట్టుకొని గుట్టకు మొక్కి- సెలుకకు మొక్కి- అటెన్క తూరుపుకు మొక్కి- ఇత్తనం జల్లిండు-

ముందటి నాగలి కదిలింది- కర్రు కస్సున భూమిలోనికి దిగింది- ఎడ్లు తోకలు ఆడించినయ్- ఒకటెన్క ఒకటి- ఒకటా రెండా ముప్పయి నాగండ్లు కదిలినయ్-

బర్ల దగ్గర సంకల కట్టె ఆనించుకొని ఓటుగాలు మీద నిలుచున్న బర్ల ఓదన్నకు గిదంతా చిత్రంగా కనిపిస్తోంది- పూరేడుపిట్ట కళ్లలాంటి కళ్లు చికిలించి నాగండ్ల వేపు చూసిండు. బర్రె పెయ్యలాంటి పెయ్యిని గీతలుబడ బరబర గోకిండు- నెత్తి పనుక్కున్నడు- బర్రె పెదిమల్లాంటి పెదిమలు ఎందుకో వనికినయ్- ఎందుకో పూరేడు పిట్టలాంటి కళ్లల్లో నీళ్లూరినయ్- అతనికి తన చిన్నతనం, వయసు, స్వంతభూమి, భార్య, పిల్లలు యాదికొచ్చారు- ఆవెనువెంటనే తాను నాగలిబట్టి దున్ని దోకిన రోజులు కళ్ల ముందు మెదిలినయ్- అప్పుకింద భూమిపోయిన దినం- బాలెంత రోగవచ్చి భార్య పోయినదినం- పసిపోరగండ్ల ఎంటేసుకొని బతికినదినాలు- పసిపోరగండ్ల తన చేతులతోటే మట్టిల కప్పిన దినాలు- తన చేతికి కట్టె వచ్చిన రోజు- ఊరి బర్ల కాపరిగా మారినదినాలు- అన్నీ గుర్తు కొచ్చాయి. అట్లా ఎంత సేపు నిల్చున్నడో ఓదెలుకు గుర్తులేదు-

తూర్పుదిక్కు సూర్యుడు చురచుర చుంటున్నాడు- అకాశంలో మబ్బులు కుదురుకుంటున్నాయి- నేలంతా పొగచూరినట్టుగా దుమ్మెన పుదుగులు లేచాయి- బర్లు నీళ్లల్లో పన్నయ్- ఎక్కడో తీతువ పిట్ట అరుస్తున్నది-

పిల్లలు బరిబాత వాగొడ్డుకు ఎండ్రికిచ్చలు, జిమ్మలు పడుతూ, కొందరు ఈదుతూ, కొందరు ఇసుకలో పొర్లుతూ కేరింతలు కొడుతున్నారు-

పిల్లల మీది నుండి దృష్టి మళ్ళీ నాగండ్ల మీదికి మలిపాడు- కండ్లు నిలబడి పోయాయి- ముఖం మీద ఎవరో ఖాడిచ్చి గుద్దినట్టుగా కమిలిపోయింది- అవరబాదరా గెంటుకుంట గెంటుకుంట ఆవలి ఒడ్డునుండి ఈవలి ఒడ్డుకు దాటి గెంటుకుంట గెంటుకుంటనే పరిగెత్తాడు- కాళ్లకు రాళ్లు తాకుతున్న లక్షనంలేదు-

ఓదెలు నాగండ్ల దగ్గరికి చేరుకునేసరికి నాగండ్లన్నీ ఆగిపోయినయ్. ఎడ్లు సిరుబురులాడ్తున్నయ్-- పిల్లాజెల్లా, ఆడోల్లు, మొగోల్లు అంత ఒక్కాడికి జేరి పోయిండ్లు- ఎవలేం మాట్లాడ్తుండ్లో ఎవలికినబడ్త లేదు-

మందిని తొలిగించుకొని మూతి లోపలికిబెట్టి ఓదెలు చూసిండు- మందిల ఏడుగురు పోలీసోల్లు తుపాకులెక్కుబెట్టి పండ్లెల్లబెట్టి మొరిగే కుక్కల్లా మొరుగుతున్నారు- వాళ్ళ మధ్యలో దర్జాగా నిల్చున్న అమీన్‌సాబ్ పిస్తోలు పట్టుకున్నాడు. అతనిపక్క ముత్యంరావు దొర ముఖం మాడ్చుకొని నిల్చున్నడు. అతనిపక్క పట్వారి గోపయ్య సెయ్యెత్తి అంతూపొంతూ లేకుంట తిడ్తుండు-

కాసేపు సంగతేందో బోధపల్లే-

అంతలోకే "మాకెలపుడా మార్ సాలెకుమార్-" యస్ ఐ అరిచిండు-

పటేల్- పటేల్- బరిబాత పెయిలమీద లాఠీదెబ్బలు- పిల్లలు ఏడుస్తున్నారు. స్త్రీలు శాపనార్థాలు బెడుతున్నారు- కాని ఎవలు కదలరే- ఓదెలు బుర్రమీద లాఠీదెబ్బ- ఎడంచేత పునికిచూసుకున్నడు. నెత్తురుకూడా కమిలిపోయి పిడుదునెత్తురై పోయింది. కాని అంతరంగంలో కోపంఎర్రగా రవులుకుంటోంది- అదెక్కడికోపమో? ఎన్నేండ్ల కోపమో? ఎవరికెరుక?

"ఆపుండ్లి-"

లాఠీలాగినయ్-

"అరె హ(రామ్‌కెబచ్చె- గీభూమి మీదిగాదు-

ఉత్తపున్నానికి దెబ్బలెందుకుదింటరు బే- సదువుండ్లి- ఎల్లిపొండ్లి- లేకుంటె మాదెర్‌చోద్ ఒక్కొక్కన్ని పిట్టనుగాల్సినట్టుగాల్సి కాకులకు గద్దలకేత్త-" యస్.ఐ-

"ఒరే లంజకొడుకుల్లాలా- మీయమ్మలకుక్కల్.... నాకుమీకు ఎప్పుడో సెల్లుబాటయ్యింది- ఎండకాలం పనులు బందుజేసి నాయేంబీక్కున్నరు- మీఎనుకున్న పార్టోల్లూ, మీరూ నా రోమం బీకలేరు(రా- నేనేతలుసుకుంటె మసిరామసి-జేసిపారేత్త" ముత్యంరావుదొర-

"వారీ గిదేంనాయెంరా? మందిభూములు దున్నుకోను పాపమా? పచ్చిభూత(రా ఇయ్యాల్ల సేండ్లమీనబడి దున్నుకుంటరు- రేపు ఇండ్లమీదబడి దోసుకుంటరు- మనూల్లె పోలీసోల్లుండంగనే గింతపనికెత్తుకుంటిరి. లాపోతెనా మాయిండ్లకగ్గి తల్గబెట్టి సేలాలేరుక బుక్కుతరు-" గోపయ్య

"నీబాంచెనాతె నీపేరుదల్సుకుంటె బుక్కెడుబువ్వన్న దొర్కది"- కొండమ్మ చేతులు మెటికలిరిసింది-

ఓదెలు పెదిమలు వనికినయ్- ఏదోచెప్పాల్నని నోరుతెరిసిండు- కని ఏది చెప్పలేక పోయిండు-

"మీ సంఘపెద్దెవరా ?" అమీను గర్జించిండు

ఎవలూ మాట్లాడలేదు–

"ఇక్కన్నుంచి కదులుండ్లి– ముదుగాలు గ జెండాలు పీక్కరాండ్లి– నక్సలైటు నాకొడుకుల తానాకు పట్టుకపోత–"

పోలీసులు జెండాదిక్కు కదిలిండ్లు–

ఎల్లయ్య పరుగందుకున్నడు– జెండాకొయ్యదగ్గర నిలుసున్నడు– పోలీసోడు తుపాకిమడమతోటి ఎల్లయ్యను అంచిగుద్దిండు–

జనంలోకదిలిక– పోలీసుల సుట్టూగిరేసుకున్నరు–

"ఖబర్దార్ జెండాలు ముట్టుకున్నరో గీడనెత్తురుదొల్లాలె–" ఎవడో ఛాతిబాదు కుంటూ గొంతు తెగిపోయేటట్టు అరిచిండు.

అమీన్ పిస్తోల్ గాలిలోనికి పేల్చిండు– దొరకండ్లల్లో కూసంత బెదురు– గోపయ్యకాల్లు వనుకుతున్నాయి–

జనంలో హాహాకారాలు మిన్నుముట్టాయి– ఒకపోలీసోడు జండా అందుకున్నడు అన్నిజనం చుట్టేసిండ్లు– "ఒకటి– రెండూ– మూడు–" అమీన్ బండగొంతుతో అరుస్తున్నాడు–

తుపాకులు మొరిగినయ్–

ఒకస్త్రీ నాగటిచాల్లల్లోపడి గిలగిల తన్నుకుంటుంది– కడుపులనుంచి కార్తున్న జీవరక్తం ఎర్రగా నాగటిచాల్లో పారుతోంది– ఎవరో యస్. ఐ. మీద దునికిండు. పిస్తోలు పేలింది– ఇంకొకడు ఎర్రిమట్టిలో తన్నుకున్నడు–

ఆకాశంలోకి రాళ్లలేసినయ్– కాని తుపాకులముందు రాళ్లనిలుపలేదు– అట్లా మరోపదినిమిషాలు తుపాకులు మొరిగినయ్– అడివి ప్రతిధ్వనించింది– చెట్లు పుట్టలు బట్టి జనంఉరికిండ్లు– ఆఖరుకు ఎల్లయ్య ఓదెలుతోసహా పదిమంది పురుషులు, నలుగురు స్త్రీలు, నలుగురు పిల్లలు దొరికారు.

వాళ్ళందరిని తుపాకులు ఎక్కుబెట్టి నడిపిస్తూ వాగుదాటి ఈవలొడ్డు జేరుకున్నరు–

నెత్తిమీదికి పొద్దచ్చెటాల్లకు పోలీసువ్యాన్ బుర్రుమన్నది–

సగందున్నిన ఎర్రసెలుకలో ఇంకా మూడుఎర్రజండాలు రెపరెపలాడుతూనే ఉన్నాయి–

*            *            *

ఆరాత్రంతా నిరాయుధులైన బందీలను తాళ్ళతో ఘట్లకుకట్టేసి కొట్టవలసిన వాళ్ళంతా కొట్టారు– పిల్లల లేతశరీరాలమీద యస్.ఐ. కొట్టాడు, తన్నాడు. స్త్రీలమీద అమానుషకృత్యాలు అన్నీ జరిపారు. పురుషుల శరీరాలు నెత్తురు ముద్దలై పోయాయి.

అయినా ముత్యంరావుకు కసితీరలేదు– నిరుపేదజనం సంఘంబెట్టుకున్న నాటి నుండి సంఘంబలపడినదాదిగా బలపడిన కసి కోపం చల్లారలేదు– గోపయ్య ఆ రాత్రంతా తాగుతూ ముత్యంరావుకు ఏదో చెప్పుతూనే ఉన్నాడు. అమీన్ పెట్టాల్సిన కేసుల గురించి తల పట్టుకున్నాడు–

బ్రాందీసీసాల మధ్య ఆలోచనలు సాగినయ్. క్యాంపు పోలీసులు రాత్రి ఊరు మీద పడ్డారు. ఇల్లిల్లు గాలించారు. గడుక కుండలు పగుల గొట్టారు– నిశిరాత్రి ముసలివాళ్ళు ఏడుస్తుంటే ఊరంతా గస్తీతిరిగారు– ఆ రాత్రి ఎల్లయ్య గుడిశెతో పాటు మరి నాలుగు గుడిశెలు కాలిపోయాయి–

తెల్లారి నెత్తురు ముద్దలై దొరికిన వాళ్ళను వ్యానెక్కించి సబ్‌జైలుకు పట్టుక పోయారు–

*            *            *

కోర్టు గదిలో ఫ్యాను గద్దలా తిరుగుతోంది–

ఎత్తుగద్దె కుర్చీమీద జడ్జి అసహ్యంగా ముఖం పెట్టి కూర్చున్నాడు– అతను నల్లగా నున్నగా కొరిగిన మీసం గడ్డంతో తాటిపండు తీరుగున్నాడు. ఎత్తుపొట్ట, ఎర్రగా ఎద్దుకండ్లలాంటి కళ్ళు–

అతని టేబుల్ ముందు ముసలిగుమస్తా అదేపనిగా రాస్తున్నాడు వంచిన తల ఎత్తకుండా

జడ్జి నెత్తిమీద గాంధీ ప్రశాంతంగా ప్రపంచంతో తనకేమీ సంబంధంలేనట్టు, అహింస నవ్వులు నవ్వుతున్నాడు–

జడ్జికి కుడివేపు అందంగా బైండుచేసిన పాపాల రికార్డులు, లా పుస్తకాలున్నాయి వాటి మీద బంగారంగు అక్షరాలు కొట్టొచ్చినట్టు రాసున్నాయి–

జడ్జి టేబుల్‌కు కొంతదూరంలో పెద్ద కర్రిటేబుల్– దాని ముందు నల్లగౌన్ల లాయర్లు అసత్యాలవైపు అతి జాగ్రత్తగా పట్టుకొని కూర్చొండి అవసరంలేని విషయాలు గుసగుస లాడుతున్నారు.

పక్కగదిలో పి.పి.ఓ. లక్ష్మణ్ రావు, డియస్‌పితో మాట్లాడుతున్నాడు.

జడ్జి బెల్లు మోగించాడు– కోర్టు జవాను బయట ఏదో పేరును బొంగురు గొంతుతో పిలిచాడు–

పి. పి. ఓ. పరుగెత్తుకొచ్చాడు–

ఆ తరువాత అమీన్ ఇద్దరు పోలీసులు వెంటరాగా కాసంత బెదురు ముఖాలతో మాసిన గుడ్డపేగుల రైతులు, రైతుస్త్రీలు, నలుగురు పిల్లలు ప్రవేశించారు– ఎల్లయ్య బోనెక్కాడు– అతనివెనుక ఓదెలు– అందరు వరుసగా నిలుచున్నారు–

లాయర్ల ముఖాలల్లో అసహ్యం రూపు కడుతోంది–

పి.పి ఓ. గొంతు సరిచేసుకొని ఉత్తిగనే గాలిపంఖా వేపు కాసేపు చూసి అలవోకగా కత్తిరించిన కుడిమీసం మీద గోక్కొని– రైతులను చూడ కుండానే జడ్జిని చూశాడు–

జడ్జి రైతులను చూశాడు–
పి.పి.ఓ. కాయిదాలు బల్లమీద పడేసి కొంచెం ముందుకు నడిచి–

"యువరానర్" అని కాసేపు ఏదో గుర్తుకు తెచ్చుకోను ప్రియత్నం చేస్తున్నట్లు నటించి– పక్కగదివేపు– ఓరకంట చూసి అక్కడ గ్లాసొక్కధోవతి తచ్చాడడం, కరుకుబూట్లు కదలడం గమనించి సంతృప్తిపడి, కొత్త ఉత్సాహంతో ఈ విధంగా వాదించాడు–

"ముద్దాయిలు చూడడానికి చాలా అమాయకంగా, నిరుపేద వాళ్ళుగా కనిపిస్తున్నారు. యువరానర్– అదంతా పైపైనటనే– వాళ్ళ గురించి మనం తెలుసుకుంటే లోకంలో ఎంతటి క్రూరత్వం, అన్యాయం తాండవ మాడుతున్నదో మనం అర్థం చేసుకోగలం– ముద్దాయిల గురించి చెప్పేముందు కొంత అగ్రిమం గురించి తెలుసుకోవాలి– రాజకీయంగా కూడా ఈ కేసు చాలా ఆసక్తి కరమైంది–

నక్కల గూడెం 1976 దాకా ప్రశాంతంగా ఉన్నది– అక్కడ ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటూ– అనివార్యంగా తలెత్తిన చిన్నచిన్న తగువులు వాళ్ళలో వాళ్ళు

సర్దుబాటు చేస్తూ– వీళ్ళను కన్నబిడ్డలుగా ముత్యంరావుగారు చూసుకునేవారు. గతంలో ఈ ఊరినుండి ఒక్క కేసుకూడా కోర్టు వారి దాకా రాకపోవడం గుర్తించాలి.

అలా ఉండగా ఇదిగో ఈ కేసులో మొదటి ముద్దాయి నక్కల ఎల్లయ్య దేశ విద్రోహ, సంఘవిద్రోహ శక్తులతో చేతులు కలిపాడు– అలాగా బాహాటంగానే కమ్యూనిస్టులు ఊళ్ళోకి రావడం మొదలయ్యింది– మీటింగులు, ఉద్రేక పూరితమైన ఉపన్యాసాలు, రెచ్చగొట్టే పాటలు మామూలైపోయాయి– ముత్యంరావుకు ప్రజలకు మధ్యనున్న సంబంధాన్ని ఆ విధంగా విచ్ఛిన్నంచేసి ముత్యంరావుగారికి వ్యతిరేకంగా జనాన్ని రెచ్చగొట్టారు–

మొదట ఇక్కడున్న వాళ్ళంతా అలా ముత్యంరావుగారికి వ్యతిరేకంగా తయారయ్యారు. ఉద్దేశపూర్వకంగా కూలిరేట్ల గురించి తగాదాపడ్డారు– ముత్యంరావుగారు కూలిపెంచారు– దానితోని ఊరొక్కక ఏదో సాకుతోటి ముత్యంరావుగారి ఇంటిమీదికి దాడికి వెళ్ళడం ఆయనను చంపుతామని, కొడుతామని బెదిరించడం– తేది 20 జనవరి 1978లో ఒకమారు కర్రలు, కత్తులు గొడ్డండ్లు ధరించి ముత్యంరావుగారి ఇంటిమీద మొదటి ముద్దాయి ఎల్లయ్య నాయకత్వంలో దాడిచేసి– ఇంట్లో ఫర్నీచర్ విరగ్గొట్టారు. తేది 2.2.78 నాడు అతని మక్క జొన్న పెరడు సర్వనాశనం చేశాడు– ఇంకా పశువుల నెత్తుకపోయారు పంటలు నాశనం చేశారు– పడారిగోడ కూలగొట్టారు– గడ్డి, చొప్ప ధాన్యం ఏది దొరికితే అది పట్టుకపోయారు. ఇలాగా యువరానర్ నేను చాలా సంఘటనలు చెప్పగలను. ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే–"

"అన్నాలెందొరా! పచ్చులసొంటోల్లందొరా! మామీన్నేపడి కొట్టిచ్చిండు దొరా–" ముసలివెంకయ్య చేతులు జోడించి పదే పదే మొక్కాడు–

"ఆడర్– ఆడర్–" జడ్జి సుత్తె బల్లమీద కొట్టాడు– పి పి.ఓ. కాసేపాగి–

"అలాంటి పరిస్థితిలో తన కుటుంబం ధన, మాన, ప్రాణ రక్షణకోసం పోలీసులకు, ప్రభుత్వానికి తనగోడు చెప్పుకున్నాడు. ఫలితంగా పోలీసులు ఆ ఊళ్లో క్యాంపుబెట్టారు–

"అవద్దం– మమ్ముల సర్వనాశిడం సెయ్యటానికి తీసుకచ్చిండు దొర–" లక్ష్మి–

మళ్లీ జడ్జి మూలిగిండు– కర్ర సుత్తె శబ్దం–

"యువరానర్! అన్నిటికి తెగించిన ఈ సంఘవిద్రోహ శక్తులకు పోలీసులన్నా లక్ష్యంలేదు– 1979 జూన్ 21న మొత్తం ఊరు ఊరంతా కలిసి ముత్యంరావుగారి

నూరెకురాల చెలుకలో ఎర్రజెండాలు పాతి అక్రమంగా దున్నుకోవడం సాగించారు- మామూలుగానే ముత్యంరావుగారు, యస్.ఐ. కొండారెడ్డి, మరి ఏడుగురు పోలీసులు చెలుక దగ్గరికి వెళ్ళారు- యస్.ఐ. కొండారెడ్డి నచ్చచెప్పడానికి ఎంతో ప్రయత్నం చేశాడు- కాని జనాన్ని విననివ్వరే - ఎల్లయ్య తూలనాడుతూ జనాన్ని రెచ్చగొట్టాడు. ఫలితంగా జనం రెచ్చిపోయి పోలీసుల మీద ముత్యంరావుగారి మీద పట్వారి గోపయ్య మీద రాళ్లతో దాడికి సిద్ధమయ్యారు- పైగా చుట్టూ చక్రబంధంగా నిలబడి ముల్లు కర్రలతో దాడి చేయడానికి సిద్దపడ్డారు- తప్పని సరైన పరిస్థితిలో లాఠీచార్జి చేయ వలసి వచ్చింది- ఆ తరువాత కొంత ఘర్షణ తరువాత గుంపు చెదిరిపోయింది- పరిస్థితి చక్కబడ్డట్టుగానే కనిపించి పోలీసులు, ముత్యంరావుగారు వెనుకకు తిరిగి వచ్చారు-

కాని ఆ రాత్రి ఎల్లయ్య నాయకత్వంలో మళ్లీ దాదాపు 500 మంది జమై ముత్యంరావుగారి ఇంటి మీదికి దాడి చేశారు- తనకు రక్షణగా ముత్యంరావుగారు ఉంచుకున్న బైరి రాములు, బందెల లింగయ్య ఇండ్లు కాలబెట్టి - ఊరంతా భీభత్సం సృష్టించారు- పోలీసులు జోక్యం చేసుకొని ఈ బోనులో నిలబడ్డ వ్యక్తులను అతి కష్టం మీద కస్టడీలోకి తీసుకోగలిగారు...."

"మోసం- దగా-" వెంకటి అరిచిండు- ఎవరో అతని నోరు మూసిండ్లు-

"ఈ విధంగా మొదటి ముద్దాయి ఎల్లయ్య, రెండవ ముద్దాయి అంకం నాగమల్లు నాయకత్వంలో ముద్దాయిలు మరి నాలుగు వందల మంది కలిసి గృహదహనాలు, దోపిడి, ఆస్తినష్టం, పరువునష్టం. మొదలగు అకృత్యాలే కాక ముత్యంరావుగారిని చంపడానికి ప్రయత్నం కూడా చేశారు-

కావున ముద్దాయిలు 197, 307, 144 ఇండియన్ పీనల్‌కోడు ప్రకారంగా శిక్షార్హులు

కోర్టువారు విచారించి న్యాయం చేయగలరని, ముత్యంరావుగారికి ప్రాణ, ధన, ఆస్తిరక్షణ కలిపించగలరని కోరుతున్నాను-"

పి.పి.ఓ. నుదురుకు చెమట పట్టింది- తెల్లటి కర్ఛీఫ్‌తో నుదురు తుడుచుకొని కుర్చీలో కూలబడి పోయాడు-

కాసేపు గాలిస్తంభించి పోయింది-

ముసలయ్య వనుకుతూ బిగుసుకపోయి నిలుచున్న వాడల్లా పిట్టలా నోరుతెరిచి-

"మా బతుకులు సూసెటోల్లెవలు లేరుదొరా! ఎంటికెలున్న కొప్పు ఎటు ముడిసినా సక్కంగనే ఉంటది బాంచెన్- గరీబోడు ఏదిసేసిన తప్పే- నీ బాంచెన్ దొరా! సాన ఏండ్లనుంచి దుర్జెట్ట బతుకులు బతికినం- పసురాల తీర్గ- కొడితెపడ్డం తిడితె పడ్డం- నోరెత్తలేదు- గుడ్లల్లనీల్లు గుడ్లల్ల గుక్కుకున్నం- మా కడుపు నొప్పేందని ఏ సర్కారు అడుగలేదు. ఓట్లచ్చినయని ఇల్లిల్లు దిర్గినోల్లు మళ్లమా మొఖం సూల్లే- మేమెన్ని బాధలు పడ్డమో? గ పరమాత్మని కెరుక-"

"పరమాత్మ డనేటోడే ఉంటె మన బతుకులు గిట్లెందుకు తెల్లారిపోత్తు" లక్ష్మి గునిసింది-

"నసరాదేపిల్లా! ఆడున్నడో? ఉంటె ఏడ తాగిపన్నడో మన కెందుకు- గ అకీలుదొర ఎన్నెన్ని పుండకోరు మాటలు మన మీన- పుట్టిచ్చి సెప్పిండు? ఇన్నరు గదా! మనకట్టం సుఖం మనం సెప్పుకుందాం-" ముసలయ్య కసిరి కొంచెం ముంగటికి జరిగిండు-

"నాకా బాంచెన్ కానూన్లెర్కలే- మాటనెనుక మాట ఇలవరిసెబెట్టి మాట్లాడ రాదు- పనిసేసి బతికినోన్ని బాంచెన్- మాటలుసేసి బతికినోన్ని గాదు- కాలం సూడవోతె నోరున్నోనిదే ఊరంటంది- తమరు అరన్నం దింటరు బాంచెన్- గ అడ్ల గింజలు బురదలనుంచి తీసేటందుకు మేంపడే కట్టం ఏంజెప్పాలె బాంచెన్- గట్ల కట్టపడి గ అరన్నాలడుగలే బాంచెన్- కాసన్ని గంజినీళ్లు దొరికితె గదే పరమాన్న మనుకున్నం- కని మావూరి దొరకు మమ్ముల గట్ల సుత బతకనియ్యటం ఇట్టం లేదు బాంచెన్- కడుపుకు సాలక కములమడిగినం- మేం నెత్తురు దారవోసి బయలు సేసు కున్న సెలుకలు కబాజసేసుకోకుండ్లన్నం- మమ్ముల గొడ్లను గొట్టినట్టు కొట్టకన్నం- మా ఆడోల్ల మనుషుల తీర్గ సూడుమన్నం- ఏంజెప్పాలె పెద్దొర- మేంసెప్పరాని బాధలు బడ్డం- సెప్పుకుంటె మానంబోద్ది సెప్పుకోకుంటె పానంబోద్ది-

మేం ఇగ గట్ల బతుకలేం అనుకున్నది తప్పయింది- మామీద కోతుకం బెట్టుకున్నడుదొర-

ఇవ్వార్దనుక అకీలు దొర మేంసెయ్యని తప్పుల గురించి సాన చెప్పిండు- పోలీసోల్లు, దొర సేసిన తప్పుల గురించి చెప్పలేదు- మా...."

"ఓముసలోడా! గీడ గయ్యన్ని సెప్పేంలాభం- నీ గుడ్డసేగులోని మాట లెవలింటరు?" ఒకపడుసోడు-

వకీల్లు అనాసక్తిగా ముచ్చట్లు బెట్టుకుంటున్నారు-

ముసలోడు అదేపనిగా ఏదో చెప్పుతున్నాడు జడ్జి. మధ్య మధ్య బల్లమీద కొడుతూనే ఉన్నాడు-

చాలాసేపటి నుండి ఇదంతా చూస్తున్న బర్ల ఓదెలుకు ముఖమంతా ఎరుపెక్కింది- పెదిమలు అదురుతున్నాయి- కొంచెం కుడిపక్క నుండి చొల్లుకారుతోంది- అతను గట్టిగా సరాయించి

"దొరా!- గియ్యన్ని సెప్పేంలాభం- నాదొక్క మాటున్నది కాసంత సెవున బెట్టుండ్లి- అయింక తమరు చేసేది చెయ్యండ్లి-"

వకీల్లు ముచ్చెట్లాపిండ్లు-

"అకీలుదొర మాదొర వచ్చాన సానా చెప్పిండ్లు- గయ్యన్ని కాదని మావోడు బారతం చెప్పుకొచ్చిండు- అకీలు సెప్పిన సంగతులు కాదని మెమంత మొత్తుకున్నా తమరి ముంగటికి సాచ్చాలుదెత్తరు-

అకీలుదొర మమ్ముల దొంగలన్నడులంగలన్నడు- లపంగులన్నడు- పానాలుదీసే కటికోల్లన్నడు- అంతేకాదు అకీలుదొర...."

పి పి ఓ. కండ్లు పులపొడిసిండు-

"మేం దొంగలమే దొరా! అకీలు దొరన్నట్టు మేం దొంగలమే అయ్యుంటే మా పెయిమీన అంగిలేకుంట నారపడి దోరపడి నరిగెలడి గిట్ల మీ ముంగట నిల్సోకపోనే పోదుము- గీ దేశంల మనకండ్ల ముంగట దొంగతనం జేసేటోడు ఒకడు- గుప్పు చాపుగ కిందికుండ కిందుండంగనే మీదికుండ మీదుండగనే నడిమికుండ తప్పుదీసెటోడు మరొకడు- అగో గాడు బాగుపడిపోతండు- పదేండ్లకింద నా దగ్గర అయిదెకురాల అవ్వల్దర్జ పెరదుండె- గదేమయిపోయింది- దొర పెరట్ల గల్సిపోయింది- దొర దొరే పల్ల నేను దొంగనయిపోయిన- నా కుటుంబం పోయింది- ఇల్లుబోయింది- పెండ్లాం సచ్చింది- ఆఖరుకు పోరగండ్లసుత బతికిచ్చుకోలేకపోయిన--- గీ ఊరుల నేను కష్టబట్టుకొని బర్లకాసి బతుకుతున్న- దొర నాకండ్ల ముంగట ఏటకేట పెరిగిపోయిండు- ఇరువై ఎకరాలోడు నూర్లెకరాలోడయ్యిండు- ఎకరం అరెకరమోడు మన్నైగల్సిపోయిండు- మన్నైగల్సినోడు దొంగ ... పెరిగిపోయినోడు, మా బతుకుల్ల మన్నుబోసినోడు దొర-

మేము సంఘంబెట్టుకున్నం నిచ్చమే. గిందుల దాపుకంలేదు మాపుకంలేదు- ఆ మాటకత్తె నా తలమీసెంటికలన్ని దొరలకు సంఘాలున్నయి- పారిటీలున్నయి- కడుపుకుజాలదన్నం నిచ్చమే- మరి మాకేమిచ్చిండ్లు- తన్నులు గుద్దులు.

బతుకుదెరువు కోసం పరంబోగుల మావోల్లు నాగండ్లు గట్టిండ్లు– సెయ్యి బొప్మ బెట్టుకోని మా ఊళ్ళెకచ్చిన తెల్లబట్టలాయిన బంజర్లు, పరంబోగులు ఇప్పిత్తనన్నడు దొరగన్క– మేం దున్నుకుంటె దొంగలం– నచ్చలేట్లం–

అఖర్న మేం ఇండ్లు గాలబెట్టినమన్నడు– పంటలు ఖరాబు చేసినమన్నడు

దొరా! గీ సెత్తసూడు దొరా! మట్టి – మట్టిలబుట్టి మట్టిదిని మట్టిల నుంచి పంటలుదీసేటోల్లం మేము– ఒక్కొక్క గింజకు ఎన్ని నెత్తురు బొట్లు అడుపుతమో లెక్కలేదు. మబ్బు మెత్తబడ్డకాన్నుంచి మామనుసు మెత్తబడ్తది– కర్రి ఏనుకుంటె మాకు పానంబడ్తది. మా రాకేత్తే మాగుండెలు గుబగుబలాడ్తయి– దాన్నిపానంల పానంగా సాది సవరచ్చనజేసి– కోసి కుప్పేసి ఇత్తులు జేత్తే బత్తాలుకుట్టిచ్చి ఎత్తుక పొయినోడు దొర– ఉత్త సేతులతోని మిగిలిన మేం దొంగలం– గ పంటల సాదేనెనరే లేకుంటె దొరా మేం బండ బారిపోతం– మాకేంరాకున్న మేం పంటల సాత్తనే ఉన్నం– గంత కట్టపడి మేం పంట బండిచ్చెటోల్లం కని నాశిడం చేసెటోల్లంగాదు దొరా! మా నెత్తురంత ధారవోసి పంటల బెంచినట్టుగనే దొరను పెంచినం– పసురాల బెంచినం– మా బతుకులు కట్టుకొని మీ సేవలుసేసినం– మేం ఒక్కొక్క పెల్లి పేర్చి ఇండ్లు గట్టెటోల్లం దొరా! కూలగొట్టెటోల్లంగాదు–

ఇక సంపెటోల్లన్నరు– గ తెగుపే మాకుంటె దొర ఒక్కడు గింత మంది మీద ఎక్కిసవారెట్ల జేత్తడుదొరా! నామట్టుకు నేను కోడిపిల్లను గోసెపగ– నెత్తురు సూత్తె నాకండ్లు సిరుతలు గమ్మతయ్–!"

ఓదెలు పిచ్చోనితీరు చుట్టూ చూసిండు–

"మనమంతా నిలుసున్న గీ కచ్చేరు ఇల్లే ఉన్నదనుకోండ్లి దొరా! డంగులు గొట్టి, ఇటికలుజేసి మాడెంటికలు ఊసిపోంగ సిల్లు నిప్పులు దాగి దీన్నికట్టినోన్ని కూలగొట్టు మనుండ్లి ఆదెంత ఇదయిపోతదో– ఆనిమనుసెంత సుమ్మర్లు సుట్టుకపోద్దో! గ కిట్టందెల్వనోడు మూడు ఘడియల్ల సత్తెనాశిడం చేత్తడు–

మా పానాలు, మానాలు దీసిండ్లు, మా పంటలు ఎత్తుకపోయిండ్లు, మా భూములు గుంజుకున్నరు. ఇండ్లు కాలబెట్టిండ్లు, సంపేసిండ్లు– మేం గ సత్తెనాశిడాన్ని సూడలేక ఒక్కటయినం–

మా నెత్తురును మేం సంపుకోం– కాని ఇంకొకడు సంపుతాంటే ఇగ సూడం– దొరా మేము అన్ని చీజ్‌ల తయారుజేసెటోల్లం– మిమ్ముల, మీ బంగుళాల అన్ని....

అన్ని— అన్ని మేమే తయారుజేసినం— అయ్యన్ని నాశనం చేస్తేమేం ఊకోము మమ్ముల మరేమన్న అనుండ్లి— నచ్చలేటులే. అనుండ్లి ఇంకేమన్నా అనుండ్లి— మాకేంపరువలేదు మానెత్తురు మరుగుతాంది దొరా!"

జడ్జి అసహనంగా కుర్చీలో నుండి లేచి ముఖం మాడ్చుకొని గొంతుచించి ఆడర్ ఆడర్ అంటూ అరిచిండు—

కేసు వాయిదా వేసినట్టుగా ప్రకటించి జడ్జి పక్కగదిలోకి వెళ్ళిపోయాడు—

పోలీసులు రైతుల చేతులకు సంకెల్లుతగిలించి వ్యానెక్కించారు—

ఎల్లయ్య ముఖం విప్పారింది— సంతోషంతో ఓదెలును కౌగిలించుకున్నాడు—

దూరంగా నిలుచున్న బక్కపలుచటి వ్యక్తొకడు పిడికిలెత్తి ఎర్రి సలాం చెప్పిండు—

వ్యాను కదిలింది—

చేతుల సంకెల్లు ఒకటికొకటి తాకిస్తూన్నారు— ఆ శబ్దంతో ఎల్లయ్య గొంతెత్తి పాటపాడుతున్నాడు—

"మా రక్తంతో సృష్టిస్తున్నా
తిండిగింజలు కట్టుగుడ్డలు....
పెట్టుబడులతో దోచుకు దాచే...
ద్రోహుల గుండెలో అగ్నికణములై...."

ఓదెలు ఇంకా పలవరిస్తున్నట్టుగా గొణుగుతూనే ఉన్నాడు.

"మా నెత్తురు— మా మాంసం— మా బొక్కలు— మా మూలుగు— మా బతుకు— మా సుఖం కట్టం— చెమట— కన్నీల్లు మేం నాశిడంజేసుకుంటామురా?"......

---

## ఎవరు ఖైదీ?

నువ్వేమో
ఆ గదిలో కూర్చొని
బయట....
కిటికీ చువ్వల కటకటాల వెనుక
తూరుపు కొండల కొమ్మల్లో
పూస్తున్న అరుణ పుష్పం
జైల్లో ఉందనుకుంటూ
నిరాశ పడుతున్నావు
రా.... గది బయటికి.

— శంకర్

# విరగ్రివీగే వియత్నమోడా !

శివసాగర్

నువు సావుదెబ్బలు తింటవురో
విరగ్రివీగే వియత్నమోడా !
నిను కాకులు గద్దల కేస్తారో్రి
కావరమెక్కిన వియత్నమోడా ! ॥వి॥

హోరెత్తే 'మెకాంగ్'నదీ
అలలమీన అడుగేసి
నాకెవ్వడడ్డమనీ
మీసాలు మెలివేసి
కుప్పిగంతులే స్తున్నవురో
హద్దుమీరి నడుస్తున్నవురో
నీ కిలలె కల్ల లయితయిరో
కరుడు గట్టిన వియత్నమోడా !
ఆ అలలె నిన్ను మింగునురో
మిడిసిపడే వియత్నమోడా ! ॥వి॥

కంపూచియా తమ్ముళ్లంత
పోల్‌పాట్ బాటలోన,
ఆయుధాలు సేతబట్టి
అలలు అలలుగ కదిలినారు
ఇక పల్లె పల్లె ఛీ కొట్టునురో
గల్లి గల్లి గద్దించునురో
నిను వాడ వాడ వోడించునురో
ప్రతి వూరే వురితాడవ్వనురో
విరగ్రివీగే వియత్నమోడా !
నీ కంతా సుక్కెదురవుతదిరో
సూపుబోయిన వియత్నమోడా ! ॥వి॥

ఖాట్టంబాగ్ మొక్క చేలల్లో
కష్టజీవులంత కత్తులైరి
రత్నకిరి సెరుకు తోటల్లోని
రైతులంతా రైఫిళ్ళయిరి

విసపు కన్నెర్ర జేస్తివిరో
విరగ్రివీగే వియత్నమోడా !
నువ్వు కుక్కసావె సస్తవురో
కొవ్వెక్కిన వియత్నమోడా !

రష్యావోడి మద్దతుతోనా
మత్తెక్కి మదంబట్టీ
కంపూచియా సీమలోన
రైతుకూలి రాజ్జెం మింగి
తైతక్కలాడుతున్నావురో
కైపెక్కి కులుకుతున్నావురో
నువు సావుదెబ్బలు తింటవురో
విరగ్రివీగే వియత్నమోడా !
నీమస్తి వదల గొడతారో్రి
మదంబట్టిన వియత్నమోడా ! ॥వి॥

నాగళ్లను పగుల గొట్టీ
లోగిళ్లను కూలగొట్టి
పసిపాపల గొంతులుకోసి
పంట చేలు పాడుచేసి
తుళ్లి తుళ్లి పడుతున్నావురో
కళ్లు నెత్తికెక్కి వున్నావురో
నువు సావుదెబ్బలు తింటవురో
విరగ్రివీగే వియత్నమోడా !
నీమస్తి వదల గొడతారో్రి
మదం బట్టిన వియత్నమోడా ! ॥వి॥

రైతన్నల యీపుల మీన
వొరి నారు నాట్లువేసి
కంపూచియా తమ్ముళ్లను
కష్టాల పాలు జేసి
రైతుకూలి రాజ్జాన్ని
రక్తపు ఉేరుల్లో ముంచి
వొగురుబట్టి వొర్లుతున్నవురో
తొడలు గొట్టి దూకు తున్నవురో

ఇక సెట్టు సెట్టు నిను సుట్టునురో
కొమ్మ కొమ్మ నిను కొట్టునురో
రెమ్మ రెమ్మ రెట్టించునురో
గాలే నిను గాలించునురో

మైదానమె మంట మండునురో
విర్రవీగే వియత్నమోడా !
మాతమ్ములొంటరిగ లేరురో
తగులమారి వియత్నమోడా ! ॥వి॥

ఏనుగుల పర్వతం మీన
గీంకారమే వినిపించగ
యాలకుల కొండల్లోన
యెలుగుబాటె కనిపించగ
'డాంగ్‌రాక్' పర్వతాల్లో
గెరిల్లాలు కదలాడగ
ఇక వురుము వురిమి నిను తరుమునురో
మెరుపు మెరిసి నిను మొత్తునురో
కొండకోన కోరాడునురో

నింగి నేల పోరాడునురో
విర్రవీగే వియత్నమోడా !
మేమంత నీ అంతు సూస్తమురో
అదిరిపడే వియత్నమోడా ! ॥వి॥

సింహనాక్ విల్లీలోన
కార్మికులంతా కదిలినారు
'నాంఫెన్' పొలిమేరల్లో
కాసెగట్టి నిలిసినారు
ఇక పగలే నిను పగబట్టునురో
రాత్రుళ్లు పోట్లాడునురో
యెన్నెలే యెంటాడునురో
నిను కాలమే కాటేయునురో
కాలంచెల్లిన వియత్నమోడా !
నీ పాపంపండి తీరునురో
పాములాటి వియత్నమోడా !
నిను ముక్క ముక్కలె సేస్తమురో
పడగ యిప్పిన పాపిష్టోడ !

[గత తెలంగాణ సాయుధ పోరాట కాలంలో 'జనగామ్' ప్రాంతంలో ప్రసిద్ధికెక్కిన 'పసపు కెన్నెర జేస్తివిరో విసునూరి రామచంద్రారెడ్డి' పాటకి మల్లె.]

## చరమాంకం !

పెద్దారెడ్డి

అరుణభానూదయాన్ని
ఆహ్వానించే వేకువలో
మసక మసక వెలుగుల జడికే
జడిసి,
విద్యుత్కత్తుల పహరాల ఆసరాగా
చీక్కని పబ్బులమాటేసి
కాటేసి
పాతేయాలని చూసావ్ !

అంతలోనే
దిక్కు దిక్కులా
లోకం భళ్లున తెల్లవారబోతోంది.
అక్కడ.... ఇక్కడ.... ఎక్కడా....
వెలుగుల్ని పులుముకుంటున్న జగమే ?
వింటున్నావా ?
అప్పుడే మేల్కొంటున్న పొలాలు
పొలిమేరలో పెడుతున్న పొలికేకలు !
నీవాడే దొంగనాటకానికి
ఇదే చరమాంకం !

(ఎక్కడ చూసినా పోలీసు క్యాంపులతతంగాలే. మా వూరు కె. లోచర్ల గ్రామంలో పోలీసు క్యాంపుపెట్టిన సందర్భంగా....)

# రెడ్ శాల్యూట్స్ డియర్ చైర్మన్

అజ్ఞాత సూరీడు

కొండమీద–

రాళ్లకూ, చిరుగుల పొరలకూ మధ్య
నా కామ్రేడ్సందరూ సుఖమెరగని నిద్రలో–
నేను మాత్రం మేల్కొనే వుంటాను సెంట్రీచేస్తూ–
ఆ చీకటి దీర్ఘరాత్రి అంతంచూసే వరకూ–
శీతాకాలపు చలికి నాభుజానికి వ్రేలాడే తుపాకీ
ఇనప బ్యారక్ పురింత వజవజ లాడిస్తుంటే–
హఠాత్తుగా గుర్తొస్తావు నువ్వు.
అప్పుడునాలో ఎంత గొప్ప వేడి ప్రవేశిస్తుంది!!
—విలాసవంతమైన విప్లవకర జీవితంలో
తరచుగా దొరకనిది అన్నం మాత్రమే–
కాలే కడుపుకు వత్తాసుగా నడక సృష్టించే
నీరసంతో ససేమిరా కదల నంటుంది శరీరం–
అప్పుడు నీ "దీర్ఘయాత్ర" గుర్తొచ్చి
పారే ఏటి నీరే పరమాన్నంలా త్రాగుతాను–
నాకెంత అద్భుతమైన బలం అప్పుడు!!!
ఈ యుద్ధం నా సహచరుల్నెందర్నో బలి తీసుకుంటుంది–
ఎటు చూసినా నిర్బంధం, నిరాశా, నిస్పృహలు–
ఒక్కోసారి వంటరిగా మిగిలిపోతాను.
కర్తవ్యం – వెనకడుగుల మధ్య ఊగిసలాడుతూ–
అప్పుడు గుర్తొస్తాడు నీ "పర్వతాల్ని త్రవ్విన ముసలివాడు"
అహో! ఎంతగొప్ప ఆత్మవిశ్వాసం కలుగుతుంది!!
అప్పుడు నాధాటికి శత్రువు చావక ఛస్తాడా?
ఆఖరికి ఓ నాటికి–
నాచిన్న ఓ నిర్లక్ష్యానికో, ఓ మిత్రద్రోహానికో–
శత్రు నిర్బంధంలో నేను పడితే–
నాచుట్టూ లాఠీలు, సన్నీలు,
చిత్రహింసల యొక్క అత్యున్నత రూపాన్ని అధిగమిస్తారు వాళ్లు–
ఫార్ములా కరక్టే అయినా ఫలితం రాదు వాళ్లకు–
నా వూపిరిని మైక్రోస్కోప్ క్రింద పరీక్షిస్తారు చివరికి–
నా అణువణువూ నిండివున్న నిన్నుచూసి గుండెలాగి ఛస్తారు వాళ్లు–!

---

9.9–79 న ఛైర్మన్ మావో యొక్క మూడవ వర్ధంతి. అందు కోసం ఈ చిన్న సంస్మరణ.

సమీక్ష :

# వేలాడిన వాస్తవం - 'వేలాడిన మందారం' నవల

ఫణిభూషణ్

'జ్యోతి' మాస పత్రికకు అనుబంధంగా వెలువడి మూడో బహుమానం పొందిన యీ నూటపదహారు అచ్చుపేజీల నవల నవల అనే పేరుకే తగునా అని సందేహం. సినిమాటిక్ టెక్నిక్ అనిపించే ఫ్లాష్ బాక్‌లు ఒకటికి మూడు మార్లు ప్రయోగించి, ఏసుదాసు, స్వరాజ్యలక్ష్మి, ప్రకాశం అనే పాత్రల పూర్వోత్తరాలను ఉత్తమపురుషలో కథనం చేయించడం, నవలాకారుడి దక్షతను తగ్గించే వేస్తుంది తప్ప, పుగడించదు.

పైగా, జైలుని ప్రత్యక్ష కథారంగంగా తీసుకున్నాక, జైళ్ల యథార్థ పరిస్థితుల మీద ఫోకస్ వెయ్యక, తన మనోభావాలకూ కోరికలకూ అనువుగా వుండేట్టు ఆ పరిస్థితుల వంకరలు దిద్దడం, ఊహాతిశయంతోగూడిన కాల్పనికవాద ధోరణే అవుతుంది గాని, వాస్తవాన్ని గుర్తించి గౌరవించే ధోరణి అనిపించదు. ఈ కథలో బాగా నీరసించిందల్లా వాస్తవికతే కాబట్టి, ఇదివట్టి అల్లికకథ అయికూర్చుంది. ముషీరాబాదు జైలులో ఆడ, మగఖైదీలు ఒకే వార్డులో— కండెమ్డ్ ప్రిజనర్స్ వార్డు అయినాసరే— యధేచ్ఛగా కలిసి మెలిసి వుండగలుగుతున్నారా? జైలంతా తిరిగిరావడానికి ఉరిశిక్ష పడిన ఖైదీలకు— కిందికోర్టుల నుంచి పైకోర్టులకు అప్పీలు చేసివున్నాసరే— జైలు అధికారులు స్వేచ్ఛ నిస్తారా? రాజకీయోద్యమంలోనైనా హత్యాభియోగం మీద జైలుకి వచ్చిన ఖైదీకి యిప్పటి పరిస్థితుల్లో రాజకీయఖైదీ హోదా గుర్తిస్తున్నారా? ఆ గుర్తింపుకోసం, విప్లవకారులు (వీళ్లా నగ్జలైట్లూ జ్వాలాముఖి సృష్టించిన జమేదారు పాత్ర కంటికి వేర్వేరు అనిపిస్తూంది!) ఎంత ఆందోళన, ఎన్ని సమ్మెలు చెయ్యవలసి వస్తూందో రచయిత దృష్టికి వచ్చిందా? అలాంటి ఖైదీ అయిన ప్రకాశం పాత్ర ఒకప్పుడు జైలు హాస్పిటల్‌లో డాక్టరుగా, స్వరాజ్యలక్ష్మి సెల్‌లో మంత్రసానిగా (గైనిక్?), మరొకప్పుడు మాస్టరుగా అవతారా లెత్తడానికి నిజంగా యిక్కడ యిప్పుడు అవకాశాలున్నాయా? నిర్దిష్టత వాస్తవికతకి ప్రాణం. అది లేకుండా వట్టి వివరాలు పోగుజెయ్యడం, శవాన్ని అలంకరించి ఊరేగించడమే.

కళల్లో వాస్తవవాద మంటే అర్థం, ఉన్నదాన్ని వున్నట్టుగా ఏకరువు పెట్టడం ఎట్లాకాదో, లేనిదాన్ని ఉన్నట్టుగా చూపెట్టడం కూడా అట్లాగే కాదు. జీవితంలో మంచీ చెడ్డా, మేలూకీడూ, వెల్లూవొల్లూ, ఎంతో కలగలిసి వున్నప్పుడు, వాస్తవవాది ఏకపక్షంగా వ్యవహరించి, తెల్ల – నల్ల భేదాల్ని మాత్రమే చూపెట్టడు.

తెలుపూ నలుపూ మధ్య ఎన్నెన్నో వర్ణాలు, వర్ణచ్ఛాయలు వున్నాయనే విషయాన్ని విస్మరించడు. అదే సమయంలో, చెడ్డను ఏమాత్రం ఆకర్షణీయం చెయ్యడు. పాఠాలు చెప్పడుగాని, తాను ఎంపికచేసుకుని పాఠకుని ముందుకి తెచ్చి నిలిపే జీవితాంశల చిత్రణలోనే పాఠాలను కూరిపెట్టుతాడు. జ్వాలాముఖికీ వాస్తవవాద కళా ధోరణికీ ముఖమెరికే లేనట్టుంది. పాత్రలు నోరువిప్పితే ఉపన్యాసాలు, ఉపదేశాలు, తీర్పులు: రచయితే బహుపాత్రాభినయానికి దిగినట్టుంది. పాత్రలను ఖూనీ చెయ్యడానికి ఇది మేలైన సాధనం, ముఖ్యంగా, ప్రకాశం అనే 'కమ్యూనిస్టు విప్లవకారుడు' (అతని మాటల్లోనే సుమా!) నోరుతప్ప తక్కిన అవయవాలు ఏవీ పనిచెయ్యవన్నంతగా ఉపన్యాసం తర్వాత ఉపన్యాసం దంచుతాడు. ఖూనీ కోరైనా బటాచోరైనా, జైలు ఆఫీసరైనాజవానైనా, గిరీశం ముందు వెంకటేశం లాగా 'డంగ్' అయిపోవల్సిందే. అంతేకాదు, మంచి తనాన్నంతటినీ ముద్దజేసి దానికి 'ప్రకాశం' అని పేరెట్టి, పరోపకార పరాయణత్వాన్నీ మానవీయతనీ సంస్కర్త గుణాన్నీ హోల్డాల్‌లాగా కూరిపెట్టినందువల్ల, చాలా పాత్రల్లో హృదయ పరివర్తన మహాసునాయాసంగా వచ్చేసి. వీళ్లందరూ సమసమాజ స్థాపనకి అనుకూలవైఖరిని చూపెట్టగలుగుతారు. ఇంత తేలికగానే లోకవ్యవహారం దారినపడితే, మరి కోరుకోవలసిందేమిటి? పోరాటాలూ, ఉద్యమాలూ కలిగించ జాలనంతటి కదలికనీ చైతన్యాన్నీ వట్టి వుపన్యాసాలు కలిగించగలిగితే, మహోపన్యాసకు డొక్కడే యీ లోకాన్నంతటినీ మరమ్మత్తు చేసివెయ్యగలడు. అప్పుడతగాడే జగన్నాయకుడు. పార్టీలూ, ప్రజాసంఘాలూ, వ్యూహమూ, ఎత్తుగడలూ, ఇవన్నీ ద్వితీయస్థానానికి దిగిపోవచ్చు. జ్వాలాముఖి నవలగానినవల చెప్పక చెప్పే సూక్ష్మం ఇదే. ప్రకాశం పేరుకే కమ్యూనిస్టు విప్లవకారుడు. నిజానికి ఛోటా మహాత్ముడు! పాజిటివ్ హీరోభావానికి పట్టిన దురవస్థ ఇది! పాత్ర అతి గొప్పతనం దాని నిర్మాణంలో తప్పని విమర్శాంశకు అపచారమే.

టూకీగా కథ చెప్పుకుందాం. అనగనగా ఒక కవి. అతనికో భార్య. భార్య కాబట్టి ముఖంమొత్తి 'ప్రేమ'లో పడి ఒక రచయిత్రిని ద్వితీయం చేసుకుంటాడు. పట్టమహిషి రోగిష్ఠి. అయినా పతివ్రతలా భర్తనూ అతని రెండో భార్యనూ తానే శోభనంగదికి పంపి ఆశీర్వదిస్తుంది. ఆవిడకో కూతురు. పేరు స్వరాజ్యలక్ష్మి. ఇదెందు కంటే 1947లో పుట్టింది. పేరు పెద్దది కాకుండా లక్ష్మి అయింది. బి.ఏ. చదివి టైపు నేర్చి ఒక 'ఆరడుగుల రాజశేఖరం' అడ్వర్టయిజింగు కంపెనీలో టైపిస్టుగా కుదిరి, చివరికి తనకు తెలీకుండానే అతని ఆకర్షణకు లొంగి, చూలాలయ్యాక అతగాడి

గుట్టెరిగి, వ్యక్తి కక్షతోనే గాకుండా ముందు ముందు తనలాంటి మానవతులెవ్వరూ మోసపోకుండా రాజశేఖరం పొట్టను చీరేసి, జైలుపాలై ఒక బిడ్డను కని, కింది కోర్టులో ఉరిశిక్షను హైకోర్టు, సుప్రీం కోర్టులు ధృవీకరించగా, ముప్పైయేళ్ళ ప్రాయంలోనే వురికంబ మెక్కుతుంది. ఈవిడే 'వేలాడిన మందారం'.

వర్ణనని సమర్థించుకోడానికా అన్నట్టు జైల్లో ఒక మందారం మొక్క వుండాలి గదా, దానిపూలు లక్ష్మిచేతుల మీదుగా అనేకులకు అందాలి కూడా. లక్ష్మి మోసపో యింది. కళ్లు మిరుమిట్లుగొలిపే అలంకరణలకూ హాయిహాయి అనిపించే సౌఖ్యాలకూ సొంత కాణీ ఖర్చుగాని జల్సాకు ఈ పేదరాలి ముద్దుబిడ్డ తండ్రి చాటుతప్పిన యవ్వని, సులభంగానే లోబడింది. తీరా తనకంత జయంత వసంత సమానుడైన రాజశేఖరానికి సొంత పెళ్లాం బిడ్డలున్నారనీ, యిలా యువతులను అనుభవించి వదిలెయ్యడం అతని సరదాలలో ఒకటని గ్రహించాకగూడా, తన ఫ్లాట్‌లోకి తీసుకెళ్లి 'ఫ్రిజ్'(ఎల్లాగొచ్చిందో పృత్తి స్టెనోకు!) నుంచి అరిందాలా సోడాలు తీసి జిన్ కలిపి అధరాల నుంచి మధుర సాలు దించి గులాబిశయ్యనూ తన దేహాన్నీ ఒకటి చేశాకనే, లోనికివెళ్ళి అతన్ని హతమార్చాలనే నిర్ణయానికి వచ్చి అమలు పరచింది. ఇలాంటి దాన్నైనా సమర్థించ గలదేమోగాని, వ్యక్తిగత హింసావాదమని దూరుబడిన కొన్ని రాజకీయ పధలను మాత్రం క్షమించలేడు కాబట్టి, ఈ సందర్భంగా ఉపన్యాసానికి అవకాశం దొరక బుచ్చుకుంటాడు. రాజశేఖరాన్ని చీవాట్లేసి గెంటి తన బతుకేదో తాను బతకలేదా చదువుసంధ్యలూ తెలివితేటలూవున్న లక్ష్మి 'కపిబిడ్డ' గనకనే దురుద్రేకాలకు లొంగిపోవాలా?

ఏసుదాసు మరోపాత్ర. వావికిగాకున్న వరసకు లక్ష్మికి జైలు తమ్ము డయ్యాడు. అది ఎలా పిలుపడిందో రచయితకి తెలిసినట్టులేదు. ఏసుదాసూ ఖూనీ కోరే. ఇక్కడి నుంచి ఎంకినీ అక్కడి నుంచి నాయుడినీ పట్టుకొచ్చి తన సంఘ వ్యతిరేకచర్యల సాలెగూటిలో చిక్కించుకున్న స్టూవర్టుపురం బాస్ 'కత్తుల రత్తయ్య' రత్నాకరరావుగా ఎన్నికలలో పోటీచేసినప్పుడు, ఎంకీ నాయుడుబావల కన్నబిడ్డ అతన్ని సత్కరించబోతున్నట్టు నటించి, తన తలిదండ్రుల దుర్మరణానికి కారణమైన ఆ దుర్మార్గుణ్ణి పొడిచి జైలుకువచ్చి వురికంబమెక్కుతాడు. జైల్లో పుట్టిన తన మగబిడ్డకు ఈ తమ్ముని జ్ఞాపకార్థం 'ఏసుబాబు' అని పేరెట్టింది. స్టూవర్టుపురం ఆంధ్రదేశంలో దుష్కీర్తి సంపాదించిన మాట నిజమే. అక్కడ 'క్రిమినల్ ట్రైబ్స్ సెటిల్మెంటు' వుంది. మగాళ్లూ ఆడాళ్లూ చోర్‌లో నిపుణులు. అయితే, పాపాల కారుసల్లటి ముద్దలు

కావలసిందేనా వీరంతా? మిగిలిన పాత్రల విషయంలో రచయిత ప్రయత్నించిన సామాజిక జీవన విశ్లేషణలూ, పరిసరాల ప్రాబల్యాలూ, పరిస్థితుల ప్రోద్బలాలూ, యీ 'స్టూవర్టుపురం' పాత్రలో ఎందుకు కనిపించకుండా పోవాలి? ఉన్నవ లక్ష్మి నారాయణ 'మాలపల్లి' ప్రశంస చేసిన రచయిత ఆ మహారచయితకు ఏభై యేళ్ల క్రితం వుండినపాటి సామాజిక అవగాహనలో ఏ కొద్ది అంశాన్నైనా నేర్చుకున్నారా? స్టువర్టుపురం వర్ణన, కత్తుల రత్తయ్య పాత్రకల్పన, సినీమాలకు మాత్రమే తగి అతిశయ చిత్రణతోగూడిన కేరికేచర్ తప్ప, వాస్తవ దృష్టితో విమర్శనాత్మకంగా జరిగింది కాదు. పాత్రల గొప్పదనం వాటి విలక్షణత మీద గాక, ప్రాతినిధ్య స్వభావం మీద ఆధారపడడం వాస్తవవాద విశిష్టత. అవి ఉలిపికట్టెలుగా ఉండగూడదు, పచ్చ్చి తునకలనిపించాలి. అలాంటి వాస్తవ వ్యక్తుల నెందరినో గుర్తుచెయ్యాలి.

మిగిలిన ముఖ్యపాత్ర ప్రకాశం. ఇతనే నేమో కథానాయకుడు; నాయకుడైనా కాకున్నా నవలలో 'ప్రొటాగనిస్ట్' అనిపిస్తాడు. రచయితకు ముఖద్వారం ఇతడే. రాయలసీమలో కడపజిల్లాలో భూస్వాముల కుటుంబాన పుట్టి పులిగుణం పోగొట్టుకుని యం.బి.బి యస్. డిగ్రీతో వ్యాపారానికి దిగకుండా, పల్లెల్లో గుడిసెల్లో ప్రాక్టీసు పెట్టి, పేద రైతు-కూలీల తలలో నాలుకై సంఘాలుపెట్టి కూలిరేట్ల పెరుగుదలవంటి ఆర్థిక కోర్కెల మీద పోరాటాలు నడిపి భూస్వాముల (స్వబంధువుల) క్రోధానికి గురై ఆత్మరక్షణకోసం నాటుబాంబువిసిరి మరొకరి మరణానికి కారణమై, ఉరిశిక్షపడి, జైలుకివచ్చి, ఖైదీలకు నాయకుడై ఎన్నోహక్కులు అతితెలివిగా సంపాదించి, అందరికీ ఉపదేశాలుచేస్తూ 'మాస్టరై' మెసలసాగాడు. ఇతను 'కమ్యూనిస్టు విప్లవకారుడు'గా ఆదర్శంగా జీవిస్తాడు, ఆదర్శంగా ప్రవర్తిస్తాడు, ఆదర్శంగానే ప్రసగిస్తాడు. అధిక ప్రసంగాలనిపించనిది తనకూ తనను సృష్టించిన రచయితకూ మాత్రమే. మిగిలినపాత్రలన్నీ ప్రకాశంచేతి- రచయితచేతి- కీలుబొమ్మలే గనక వాటికిగూడా ఈ ప్రసంగాలన్నీ ధర్మోపదేశాలే. వీటికి సమయం, సందర్భం ఉండవు. జైలు మాన్యువలూ అడ్డంరాదు. గోడలూ అడ్డు నిలవవు. సంస్కర్త కదా మరి- అతనికి హద్దేమిటి? వట్టి ఉపదేశపర్వతం (డిడాక్టిసిజం) కళ ప్రయోజనాన్ని ఎలా భంజిస్తుందో కళాకారుడికైతే తెలుస్తుంది. గోపీచంద్ చివరి నవలల్లో పతనీయతని దెబ్బతీసిందిదే. రంగనాయకమ్మ యిటీవలి రచనల దౌర్బల్యం కూడా ఇదే. అయినా జ్వాలాముఖికి యిలాంటి కళాసూక్ష్మాలు పట్టవు. కళకు పాక్షికత (tendentiousness) తప్పనిసరి అయినంతమాత్రాన, అది అక్షరాల వమనం కానక్కర్లేదు, కాకూడదు కూడా. పాత్రల, ఘటనల, సంభాషణల ఎంపికలోనే ఈ సందేశం యిమిడివుండాలి.

అంతేగాని, ఈ నవల్లో ఒకచోట రచయితే అన్నట్లు, ప్రకాశం కోతికిసైతం డార్విన్ సిద్ధాంతం చెప్పబోతుంటే, ఆ 'సైన్సు పాఠం' వినలేక, 'బోరు! అన్నట్లు ఆవలించి' ఆ కోతి తన తలపేలు తీసి కుక్కుకోసాగింది, కాబట్టి నవలలోని ఇతర పాత్రలకంటె ఈ కోతే ఎక్కువ విచక్షణ చూపిందనాలి.

ప్రకాశం చెవినిల్లుగట్టుకుని నాతులకూ కోతులకూ పిన్నలకూ పెద్దలకూ ఖైదీలకూ జైలధికారులకూ బోధించే 'సమసమాజం' గురజాడ మాటల్లో "కవుల కల్పన బలిమిని" ఎన్నో లేని వన్నెచిన్నెలు దిద్దుకున్న స్వప్న సమాజమే. సమ సమాజంలో సైతం వైరుధ్యాలు, వర్గపోరాటాలు కూడా, వుంటాయని విప్లవ శాస్త్రం విప్లవ చరిత్ర స్పష్టంగా చెబుతున్నప్పుడు, స్వర్గమేదో భూమిమీదికి ఊగివస్తుందన్నంత అసాధ్య ఆదర్శ దృశ్యాన్ని చూపెట్టడం, మార్క్సిస్టు ననుకునే ఏ రచయితకీ తగదు. పైగా, శుష్క హృదయ వాదం (సెంటి మెంటలిజం)తో గూడిన యీ చిత్రణ 'కరుణ'కు ప్రథమస్థానం ఇస్తుంది, తానొక సరికొత్త బౌద్ధమైన చందంగా. కరుణనూ శోకాన్నీ కలగలిపి, యీ మిశ్రణం నుంచి కన్నీళ్ళను రాబట్టే రచయిత, మార్క్సు తన "కమ్యూనిస్ట్ మేనిఫెస్టో"లో క్రిస్టియన్ సోషలిస్టుల గురించి చేసిన వర్ణనకు బాగా సరిపోతాడు. కాకుంటే, కరుణ 'రసం' వీర 'రసాని'కి తొలిమెట్టు కావాలనడం జ్వాలాముఖి భావంలో విశేషం. ఒకవైపు ఈ 'రస'వాదమే ఎంతో అనర్థాన్ని కలిగించిందంటూ, మరొకవైపు అదే చేత్తో 'రస' చర్చ చెయ్యడం ఈ రచయితకే తగును. అదికూడా సాహిత్య సందర్భంలో కాదు సుమా, సామాజిక కార్యాచరణ సందర్భంలోనే కాబట్టి దీని సందర్భశుద్ధి ఎంత గొప్పగావుందో చెప్పలేము. 'దయా వీరం' అనే దొకటి ఉన్నట్టు గుర్తుంటే, యీ కరుణ వీర ప్రస్తావన చేసి వుండేవారు కాదు జ్వాలాముఖి. ఏ జీమూతవాహనుడో శిబిచక్రవర్తో వచ్చి ఇలాంటి సమసమాజాన్ని స్థాపించి నిభాయించవలసి వుంటుంది గాని, మానవమాత్రులు వర్గపోరాటాన్ని నిలుపులేని కన్నీళ్ళతో తడిపి నానబెట్టి కరుణతో చిగిరింపజేయడం అసంభవం. కరుణ వగైరా వ్యక్తి విశేషాలు మాత్రమేగాని ఉద్యమాలకు అతకవు. వర్గపోరాటం దయా దాక్షిణ్యాల నెరగదు. దాని విలువలే వేరు. అలా కాకుంటే, అది సరికొత్త క్రైస్తవమో బౌద్ధమో కావాలి!

జ్వాలాముఖి అభిప్రాయాల సర్వస్వం అనదగిన యీ చిన్ని నవలలో, ఎత్తి చూపాలంటే, అపసవ్యం అశాస్త్రీయం అని చెప్పడానికి ఎన్నైనా ఉన్నాయి. సూర్యుడట, 'కర్మసాక్షి' అట! జైళ్లు సంస్కరణ కేంద్రాలు కావలెనని 'ధర్మశాస్త్రాలు'

చెబుతున్నాయట! 'ఉపన్‌స్లిబ్' పుద్యమాలు 'అడ్డదారి' పట్టాయట! మానవుడు 'స్తన్యజీవి' కాబట్టి పోతపాలు పనికి రావట! కురుక్షేత్ర యుద్ధంలో కౌరవులు, లంకాపురంలో రావణుడు వట్టి స్వార్థపరులు! 'ఆలీబాబా ముఠాకూ' దొంగల ముఠాకూ తేడా లేదు! ఇలా ఒకటి కాదు— జ్వాలాముఖి వ్యాఖ్యానంచెయ్యని అంశం నేటి జీవితంలో దాదాపు ఏదీలేదు. ఇది రచయిత అత్యాశకు నిదర్శనం. అత్యాశ రచనలో అనవసర విషయాలను ఎన్నిటినో తెచ్చి అత్యవసర విషయాలమీద మోపి వీటిని కిందికి నెట్టి వేస్తుందనే ఇంగిత జ్ఞానం రవంతవున్నా, ఏ రచయితా ఇలాంటి వాచాలత్వ ప్రలోభానికి లోబడిపోడు—

కడప జిల్లాలో నిమ్మతోటల్నే గాక, చెరుకు తోటల్నీ అరటి తోటల్నీ చూపడం అటుంచి, పాపం, దాన్ని 'కల్లోలిత ప్రాంతం'గా ప్రకటించడం— అలా ప్రకటించనందుకు వెంగళరావునీ చెన్నారెడ్డినీ తప్పుపడుతున్నట్టుగా వుంది. ప్రకాశం కడప జిల్లా మనిషే ఎందుక్కావాలి? రచయిత ఆ జిల్లా మనిషై local colour బలంగా యివ్వగలిగివుంటే ఆ జిల్లాను తెచ్చి నిలపడం సమంజసమే. 'కల్లోలిత' ప్రాంతాలుగా ఎన్నో దురవస్థలు అనుభవిస్తున్నవి ఎన్నో వుండగా, ఆ వాస్తవాన్నివదిలి ఈ కల్పనను తెచ్చిపెట్టడం ఎందుకో అంతుపట్టదు. అంయితే అసలుకీ నకలుకీ ఎంతభేదమో అంత కూడా లేదు ఈ జిల్లా వాస్తవానికీ నవలలో వర్ణనకీ. అందుకే, ఈ కల్పన అభూత కల్పన అనిపిస్తుంది.

ప్రతి పాత్ర నోటా తన మాటలే చొప్పిస్తూ తన కొనవేలి చుట్టూ ఘటనల్ని తిప్పిస్తూ జ్వాలాముఖి సృష్టికర్తగా కనిపిస్తున్నారు గానీ కళాస్రష్టగా కాదు. భాష తెలీదని చెప్పిస్తూనే ఏసుదాసుచేత లక్ష్మికి మంచి భాషలో ఉత్తరం రాయించారు. ఈ రోజుల్లో బి.ఏ. చదువుకున్న లక్ష్మిచేత తన 'మాన'హరణం గురించి ఎంత ప్రబంధ—పసందుగా ప్రకాశానికి చెప్పించారో చదివితీరాల్సిందే. ఎంత పారవశ్యం ఎంత ఇదీ! ముక్కు సంపెంగ పూవు కావల్సిందే. 'అస్తినాస్తి విచికిత్సా శాతోదరి' తన 'లేని నడుం' వర్ణించాల్సిందే. కంఠం శంఖమే. బుగ్గలమీద యవ్వనం మొగ్గలే. "నీవీ బంధ విమోచనం", "కోణార్క శిల్పాల కర్థం తెల్పిన రాత్రి"లో "అద్వైతం" కలిగించాలి. "జీవన స్థాయీభావంలో రతిశ్రాంతనై"— ఆహా! రసం! రసాల్లో శృంగారం! అందులో "గానలోలుడైన" కృష్ణుడూ, నవ్వు వెన్నెలలు కురిసే వసంతుడూ, రంభా పరిష్వంగ పులకాంకిత గాత్రుడైన నలకూబరుడూ— ఇది ముద్దుపళని "మదన సంగ్రామ కేళి"నీ రంగాజమ్మ రసికత్వాన్నీ మళ్ళీ యిప్పుడు గుర్తుచేసిన నవలా ప్రబంధం.

కవులు నవలా కారులుగా రాణించడం అరుదని జ్వాలాముఖి తన నవల ద్వారా మరోమారు నిరూపించారు. కవిగా కూడా జ్వాలాముఖి దిగంబర దశలోనూ అటు తర్వాతనూ పెద్దగా రాణించ లేదనడం వాస్తవం. దీనికి ముఖ్యకారణం, తన మనస్సులో ఎంతో కాలంగా పేరుకు పోయివున్న పౌరాణిక భావ కశ్మలాన్నీ సాంప్రదాయిక భావ సంకీర్ణతనీ వదల్చుకోలేక పోవడమే. పైగా, కవిత గూడా దుర్గమారణ్యంగా కనిపించేలా, అన్వయం కుదరని అర్థం అమరని గొట్టుమాటల ప్రవాహం అనిపించేలా, పాఠకుణ్ణి చాలా శ్రమపెట్టేటుగా జ్వాలాముఖి చేతిలోపడి తన రూపుని చెరుపుకుంది. వచనమైనా జ్వాలాముఖి హస్తస్పర్శకు తన సాఫీతనాన్నీ తేటదనాన్నీ పోగొట్టుకుంటున్నదని ఈ 'వేలాడిన మందారం' నవల అడుగడుగునా సాక్ష్యం యిస్తూవుంది. తెలుగు నవలనూ ఆధునిక వచనాన్నీ చాలా వెనక్కు విసిరి వెయ్యడంలో మాత్రం ఇది విజయం సాధించిందని చెప్పాలి.

మైకెలేంజెలో ఒకశిల్పమనే భ్రమలో ఉన్నట్టుంది రచయిత. అతని డేవిడ్ విగ్రహమని అర్థంకాబోలు? 'తేజస్సు' 'ఓజస్సు' గొడవలో భ్రమలుగాక మరేమిటి కలుగుతాయి? "తరుణతారుణ్యం" "అరటిమళ్లు" "ఘటనా ఘటనపటపిథులు",— యిలా జ్వాలాముఖి మాటల్లోనే, "భాషకూడ మోసంచేస్తున్నది". "హతవిధీ!" అనేమాటల్ని పలికే (హాస్యానికికాబోలు) పాత్రలు కూడాఉన్న యీనవల, సమసమాజానికి అనుకూలంగా పాఠకుల మనస్సులను తిప్పుతుందో లేదోగాని జ్వాలాముఖి / ప్రకాశం వాక్చాతుర్యంవల్ల పాత్రలనుమాత్రం తిప్పినాననుకుంటున్నది. అర్థం అధ్వాన్నపు అడవి పాలయ్యే కొత్త (అపూర్వ) మాటలను ఎన్నిటినో సృష్టించారు. ఈ అభిప్రాయాలతో, ఈభావాలతో ఈమాటలతో, పాఠకుడు తలతిప్పేసుకుంటూ, 'బోర్' అనకుంటేచాలు! "కపిశాపం"వల్ల మారాల్సినట్లుందిగాని, ప్రజల కోపంమూలంగాలేచే ఉద్యమంవల్ల మారాల్సినట్టు కనిపించదు. సమాజం ఈనవలలో! "జగత్సత్యాల వేదవేద్యుడు" — 'మెస్సయా'— రావల్సినట్టుంది మార్చడానికి! ఈలోపల నిజమైన మందారాలు రాలిపోవల్సిందేనా?

---

## పాఠకులకు విజ్ఞప్తి

## సృజన 100వ సంచిక ఫిబ్రవరి 1980

సృజన నూరవసంచిక ప్రత్యేకసంచికగా తయారవుతున్నది. తొంభైతొమ్మిది సంచికలలోని ఎంచదగిన రచనలతోకూర్చే నూరవసంచికలో పాఠకుల ఎన్నికతో కొన్నిరచనలు వుంచాలనుకుంటున్నాము. ఈసంచికలో మళ్ళీ ప్రచురించదగిన రచనలను సూచించవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాం. మా కూర్పులో మీసూచనలకు ప్రాముఖ్యం వుంటుంది. సృజన గతసంచికలలో ప్రచురించబడిన, మీకు బాగానచ్చిన, మళ్ళీ మళ్ళీ చదువుకోవాలనిపించే రచనలను సూచించవలసిందిగా కోరుతున్నాం.

సాహితీ మిత్రులు.

మీ సూచనలు మాకు డిసెంబర్ 1, 1979 వరకు చేరాలి.

సృజన నూరవసంచిక,

సృజన మాసపత్రికగా జన్మదినసంచిక,

ఫిబ్రవరి 1980 ప్రత్యేక సంచిక జనవరి 25 వరకు వెలువడుతుంది.

---

## విరసం సభలకు కొత్తపుస్తకాలు :

విరసం ప్రచురణలు : సాహిత్య పాఠశాల ప్రసంగవ్యాసాలు

1. ప్రజల పాటలు- అనుభవాలు
   గద్దర్, రామారావు, వంగపండు ప్రసాద్ రు. 1-25
2. చరిత్ర, భాష, సాహిత్యం- శాస్త్రీయదృక్పథం
   పి. సి. నరసింహారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు రు. 0-60

సృజన ప్రచురణలు :

1. మార్క్సిజం- సాహిత్యం- త్రిపురనేని మధుసూదనరావు రు. 1-25
2. కొలిమంటుకున్నది- అల్లంరాజయ్య రు. 5-00

**SRJANA Telugu Monthly** **Oct. '79** **H/WL-10**
Regd. No. with Registrar of News Papers 10953/67

# సృజన జీవిత సభ్యులుగా చేరండి- చేర్పించండి

ఇవ్వాటి గురించి ఆలోచిద్దాం-

ఇరవయ్యొకటవ శతాబ్దం గురించి కూడ ఇప్పటి నుంచే ఆలోచిద్దాం.

ఇవ్వాళ సృజనను నిలబెట్టుకుందాం- ఇరవయ్యొకటవ శతాబ్దం సృజనకు ఇప్పుడే ఇంధనం ఏర్పాటు చేద్దాం.

'అరవై ఆరు నుంచి త్రైమాసికగా, ఒక దశాబ్దంగా మాస పత్రికగా ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో తప్ప ఎన్నడూ ఆగిపోకుండా వెలువడుతున్న ఒకే ఒక్క ఆధునిక సాహిత్య వేదిక సృజన.

మీరు సృజనకు చందాదారులుగా చేరారు, చేర్పించారు-

విరాళాలు ఇచ్చారు. మీకు వీలయినంతగా తోడ్పడ్డారు.

పత్రిజల ఆదరణవల్లనే సృజన నూరవ సంచికకు చేరువవుతున్నది.

నూరు పూలు వెయ్యి కాయలుగా సృజన

నూతన సమాజ పరిమళాలు, ఫలాలు పంచడానికి

## సృజన జీవిత సభ్యులుగా చేరండి.

జీవిత సభ్యత్వం 200 రూపాయలు

ఒకేసారి గానీ, నాలుగు సమాన వాయిదాల్లో ఒక సంవత్సరం లోపునగానీ

చెల్లించవచ్చును.

శాశ్వతంగా సృజన మాత్రమే కాదు

మీరు సృజన ప్రచురణలపై 25% కమీషన్ కూడా పొందుతారు.

సృజన జీవిత సభ్యులుగా ఈ రోజే చేరండి, చేర్పించండి.

పత్రికా జీవిత ప్రతిస్పందన సృజన పది కాలాలపాటు చేయూత నివ్వండి.

Rs. 1-50

SRJANA
Hanumakonda, Warangal 506001